# దర్శనకర్తలు-దర్శనములు

( సర్వదర్శన సంగ్రహము )

1వ భాగము

చార్వాక బౌద్ధ జైన దర్శనములు

నాస్తిక దర్శనములు

( సాయణ మాధవ శంకరాదులు )



చర్ల గణపతిశాస్త్రి

వెల రూ॥ 10-00

# దర్శనకర్తలు - దర్శనములు

(సర్వదర్శన సంగ్రహము)

1వ భాగము

చార్వాక బౌద్ధ జైన దర్శనములు

నాస్తిక దర్శనములు

(సాయణ మాధవ శంకరాదులు)



## చర్ల గణపతిశాస్త్రి

# సర్వదర్శన సంగ్రహము

## దేవ గురు నమస్కారము

నిత్యమనంత మనాద్యము
శ్రుత్యంతజ్ఞేయ మఖిలలోకాశ్రయమున్
సత్యస్వరూప మవ్యయ
మత్యంతానందతత్త్వమనయము గొలుతున్

దర్శనంబులచే మతద్రష్ట లేది
వివిధరీతులఁ బపచించి విశదపఱచి
రట్టి వేదాంత వేద్యము నద్వితీయ
మేకము నగుబ్రహ్మము నుపాసింతు మెపుడు

తొలి నారాయణు డాత్మరూపమున నెందున్ క్షీర మట్లొప్పి లీ
లలకై యాపయి పాలమీగడయటుల్ వ్యక్తాకృతిం బొంది ని
ర్మల మాకాశము నందు గాలి, జ్వలనం బాపై నటన్ నీరు నం
దిల,యన్నం బయి జీవియై వెలుగు నాయీశున్ సదా మ్రొక్కెదన్

శ్రీనారాయణబుధు వి
జ్ఞానధురీణుని ననేకశాస్త్రజ్ఞుఁ గవీ
శానునిఁ బితఁ దల్లివేంకమ
నానాగతి మ్రొక్కి దర్శనముల మథింతున్

వివిధకృతులఁ బత్నిసుశీల,విమల కమల
చర్ల బుద్ధనారాయణశాస్త్రి విదుల
మృదుల యను నాసుతులు నాంధ్రు లెఱుఁగఁ దెనుఁగు
సలిపితిని చర్ల గణపతిశాస్త్రి నేను

# ★ విన్నపము ★

పిన్ననాటినుండియే వేదాంతగ్రంథములఁ జదువు అలవాటు నా తండ్రిగారినుండి నాకు సంక్రమించినది. శ్రీ సీతారామాంజనేయాది వేదాంత గ్రంథముల వారే నాచేఁ జదివించిరికూడను. వేదాంతగ్రంథములలోఁ దఱుచుగఁ బరిభాషాపదముల వాడియుండుటచేఁ దక్కువచదువుఁ గల నాబోటివారికి అర్థమగుట మిగుల కష్టముగనుండుననుట అతిశయోక్తి కాదు. పెద్ద పండితులకుఁ గాకున్నను సామాన్యపు చదువుగల ముముక్షు జనోపయోగముగ నుండఁగలదను తలంపుతోఁ బరిభాషాపదములను సుమారు రెండువేలవరకు సమకూర్చి ఆంధ్ర వేదాంతపరిభాషయను పేరుతో గ్రంథరూపమున వెలువరింపఁగలిగితిని. ఈ తొలికూర్పున కొన్ని తప్పులు అనివార్యముగ దొరలినవి. తప్పొప్పులపట్టికను గ్రంథము యొక్క చివరఁ జేర్చితిని. తప్పుల సవరించుకొని చదువుకొనుటకు పాఠకులఁ బ్రార్థించుచున్నాను. రెండవకూర్పు ఏర్పడినచో దిద్దుకొందును. బ్రతుకుతెరువులకుపయోగించు చదువులెన్నియో ప్రపంచమున నుండ వేదాంతగ్రంథములఁ జదివించి యా మార్గముననే నడువవలెనని నా కాదేశించిన నా తలిదండ్రులగు కీర్తిశేషులు శ్రీమతి శేషమ్మగారికిని, పూజ్యశ్రీ బొమ్మినేని వేంగమనాయఁడుగారికిని, భక్తితో నీ గ్రంథము నంకితమొనర్చుచున్నాఁడను.

ఈ గ్రంథమును గూర్పవలసిన సంక్షిప్తమార్గ మెఱిఁగించియు; దొసఁగుల సవరింపఁజేసియు, గ్రంథమునుగూర్చి తన యమూల్యాభిప్రాయముతోఁ బాఠకలోకమునకు పరిచయముఁ గావించిన గురుతుల్యులును, మాన్యులునునగు విద్వత్కవికులతిలక బిరుదాంకితులగు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారికిని, శరీరారోగ్యము కుందువడియున్న సమయమైనను శ్రమకోర్చి గ్రంథముపై తన యభిప్రాయమును వ్రాసి యిచ్చినట్టి నిరంతరాంధ్రభాషా సరస్వత్యుపాసకులును, బహుగ్రంథకర్త

ఆయుర్వేదము గాంధర్వ, వేదంబు నర్థ వేదమున్
ధనుర్వేదంబునని యా, యుప వేదాలు నాలుగు.

స్పష్టంబుగ శిక్షదెల్పున్. వేదోచ్చారణపద్ధతుల్
వ్యాకరణంబు వ్రాక్రుచ్చున్. సంధిన్ బద వివేకమున్

స్ఫుటంబుగ నిరుక్తంబు, నిర్వచించున్ పదంబులన్
వేదకర్మల్ చేయు వేళల్, జ్యోతిశ్శాస్త్రము చెప్పును

కర్మల్ కావించుక్రమమున్, కల్పసూత్రము తెల్పును
మాత్రాక్షరపద్య రీతుల్, ఛందస్సువివరించును.

వేదార్థ విచారణంబున్, మీమాంస బోధచేయును
ప్రమాణాదుల లక్షణం, బెఱిగించును న్యాయము

నష్టంబౌ వేదశాఖల, వార్తల్ చెప్పుఁ బురాణముల్
ధర్మాది పురుషార్థంబుల్, కథలద్వార తెల్పును

వర్ణాశ్రమక్రమంబుగా, ధర్మాధర్మంబులెయ్యవో
యేర్పర్చి చేయుధర్మాలన్, స్మృతులునియమించును

రోగాలకుఁగారణంబున్ నిదానాలౌషధంబులున్
ఆయురారోగ్య పద్ధతులాయుర్వేదంబు తెల్పును

అన్న పానాది సౌఖ్యముల్. భోగభాగ్యాది సంగతుల్
యంత్ర తంత్రాది పద్ధతు, లర్థ శాస్త్రము వాకొనున్

పురోడాశముఁ జరువున్, దక్షిణలును నాజ్యమున్
చతుర్వర్గ పురుషార్థాల్, వ్రాక్రుచ్చు నర్థ శాస్త్రము

ఆయుధంబుల రీతులన్, యుద్ధతంత్రము నేర్పును
సైన్యాదుల ధనుర్వేదం, బరులన్ గెల్పు తెల్పును

సామ గాంధర్వ వేదాలు, స ప్తస్వరాలఁ దెల్పును
స ప్తస్వరాల యోగంబు, వేదాల కుపయోగము

అంగోపాంగోప వేదంబుల్, వేదాలఁ బూ ర్తి చేయును
అష్టాదశ విద్య లందు, మీమాంస కడు గొప్పది

ఇర్వ దధ్యాయముల్ గల్గి, వస్తు భేదాల రెండగున్
కామ్యార్థ పూర్వ మీమాంస, ద్వాదశాధ్యాయ యు క్తమౌ

దీని సూత్రించె జై మిని, భాష్యంబు శాబరంబగున్
మీమాంసా వా ర్తి కంబగున్, భాట్టంబున్ * భట్టు వ్రాసెను.

భట్టుశిష్య ప్రభాకర, గురుండికి ప్రభాకరం
బనఁగ శబర మతం, బల్ప భేదాలఁ దీర్చెను

ఉ త్తర మీమాంస యెన్మి, దధ్యాయంబులు, రెండది
దేవకాండ జ్ఞాన కాండల్, వ్యాసుండు చేసె సూత్రముల్

మొదటినాల్గధ్యాయముల్, చెప్పును మంత్రదేవులన్
సంకర్షుండిదిచెప్పెన్, దేవతాకాండ పేరుతో

నాలుగధ్యాయములతో. శంకరపూజ్యపాదులు
ఉ త్తరమీమాంసభాష్య, మొప్పున్వేదాంతమద్దియే

గౌతముండుకణాదుండు.కపిలుండును జై మిని
వ్యాసపతంజలుల్ వీరు, వై దిక సూత్రకారులు

అర్హతుండునుబుద్ధుడు, వేదమార్గవిభిన్నులు
దయాస త్త్వశౌచాదులు, వారి చేనాదృతంబులు

చార్వాకుడు బృహస్పతి, వేదమార్గవిరోధులు
అధికారిభేదములచే, వీరుశాస్త్రాలుగూర్చిరి

---

* భట్టు = కుమారిలభట్టు.

వివ:- బృహస్పతి సురలకు గురువు. రాక్షసులు వేదకర్మలు చేసి యనేక సిద్ధులు పొంది దేవతలను బాధించుటచే వారికి వేద కర్మ లందు శ్రద్ధ పోవుటకు బృహస్పతి వేదములు ప్రమాణములు కావనియు తాత్కాలిక లాభమే ముఖ్యమనియు చెప్పి ఆ రాక్షసులను అధర్మావలంబులుగాఁ గావించెనని పౌరాణికులు చెప్పుదురు.

వేద ప్రామాణ్య మొప్పని, వారు చెప్పిన దానిని
వేద ప్రామాణ్య వాదులు, యుక్తిన్ వారింపఁగా వలెన్

చార్వాకదర్శ నాది విశేష దర్శనములను తెలిసికొనుటకు ముందు అసలు దర్శనములు అనేక విధములుగా ఎందుకు బయలుదేఱవలసి వచ్చెనో తెలిసికొనవలెను. 'దృశ్యతే అనేన' దీనిచేత చూడబడును గాన దర్శనము అని దానికి వ్యుత్పత్తి. ఇక చూడవలసినది ఏది అనఁగా ఆ దర్శనకర్తల యభిప్రాయములనుబట్టి ఆచూడవలసినవి సుఖదుఃఖములు, ధర్మాధర్మములు, పాపపుణ్యములు, జీవపరమాత్మ తత్త్వములు, ఆత్మతత్త్వము మొదలగునవి అని తెలియుచున్నది.

సుఖాదులను ఎందుకు తెలిసికొనవలెను. ఆ తెలిసికొనవలసిన వాడు ఎవడు అనఁగా పురుషుడు అని తేలుచున్నది. పురుషుఁడు అనఁగా పురి - శరీరమనెడి పురమునందు శేతే = శయనించుచున్నాఁడు కాన పురుషుఁడన బడెను. స్థావరజంగమాది శరీరములందు ఉండు జీవుఁడె పురుషుఁడు. ఆ జీవి స్త్రీగాని, పురుషుఁడుగాని, పురుగులు చెట్టుచేమల దేహములందున్న వాఁడు గాని పురుషుడనబడును. పురుషుఁడు శరీరము ఉండగనే సుఖమును పొందుటకును దుఃఖమునుండి మరలుటకును పుట్టినది మొదలుకొని ప్రయత్నించును. సుఖము అనఁగా అప్పటిమట్టుకు ప్రియముగనుండి తర్వాత దుఃఖము గూర్చునది. అప్పటికి దుఃఖముగా నున్నను తర్వాత చాలకాలము ప్రియముగా నుండునది శుభము అనఁబడును. పురుషునిచే సుఖాదులు అర్థ్యంతే కోరబడునవిగాన వానిని పురుషార్థములు అన్నారు. అవి ధర్మము అర్థము కామము మోక్షమునని పూర్వులు చెప్పిరి. వీని వివరము ముందు తెలుపఁబడును.

మానము శబ్దము అని ప్రమాణములు నాలుగు సృష్టిని సృష్టి కర్తను దెలుపుటకుపయోగింతురు.

ఈ ప్రమాణములను అంగీకరించుటలో అనేక మత భేదములున్నవి. కాన తమ తమ మతములనుబట్టి ఆయా మత కర్తలు అనేకముగా సత్యమును దర్శించిరి. ఆ దర్శనములు అనేకముగా నున్నను మూల భేదమును బట్టి 1 బౌద్ధము 2 నైయాయికము 3 సాంఖ్యము 4 జైనము 5 వైశేషికము 6 జైమినీయము అని ఆరేయనియు దేవతా భేదమును బట్టి మోక్షసాధక తత్త్వమును బట్టియున్నవని హరి భద్రసూరి చెప్పెను. విద్యారణ్యులు ఇంకను కొన్ని ముఖ్యదర్శనములను చెప్పిరి.

చార్వాకమతస్థులు లోకాయతికులు ప్రత్యక్షప్రమాణమునొక్క దానినె అంగీకరించి యింద్రియ ములకు ప్రత్యక్షముగాని వానిని లేవని యనిరి. జైన[అర్హతములు]బౌద్ధులు ప్రత్యక్షము అనుమానము అను రెండిటినే అంగీకరించిరి. శబ్దప్రమాణమును అంగీకరింపరు నైయాయికులలో ఏకదేశికులు ప్రత్యక్షము అనుమానము ఉపమానము అని మూడింటినే అంగీకరించిరి. ప్రత్యక్షము అనుమానము ఉపమానములు శబ్దముఅని నాలిగింటిని నైయాయికులు వేదాంతు అంగీకరించిరి. సాంఖ్యులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దముల రించిరి. ఈ నాలుగేకాక అర్థాపత్తిఅను దానినిగూడ ప్రాభాకరులు అంగీకనంగీకరించిరి. దేవదత్తుడు బలిసి యున్నాడు పగలు భుజింపడు అనుచోట పగలు భుజింపకున్నను బలిసియున్నాడు కాన రాత్రి భుజించుచున్నాడను నర్థము ఆసన్న మగుచునున్నది. [లభించుచున్నది.] కాన అర్థాపత్తియను ప్రమాణమును గలదందురు. ఇట్లే అనుపలబ్ధిగూడ గలదని ఆరింటిని భాట్టవేదాంతులందురు, రామానుజులును మాధ్వులును ప్రత్యక్షానుమాన శాబ్దముల నంగీకరించిరి. మాహేశ్వరులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దములనంగీకరించిరి. సాంభవికము ఐతిహ్యముగూడ గలవవి ఎనిమిది అనిపౌరాణికులు, చైష్టికము గూడ గలదని తాంత్రికులు అది తొమ్మిదని అందురు.

ఈ ప్రమాణములచేత దెలిసికొని పొందవలసినవి ధర్మార్థ కామమోక్షములనెడి పురుషార్థములు.

ముల చేత తెలిసికొనబడును గాన అవి ప్రత్యక్షములనఁ బడెను. కొన్ని ప్రత్యక్ష ప్రమాణముచే తెలియబడవు. కాన అవి యున్నవా లేవా అని సందేహము కలుగును. దూరమున కొండమీఁద నిప్పు ఉన్నదో లేదో సందేహము కలుగును. ఆ కొండమీద పొగ మాత్రము కనిపించును. అప్పుడు మనకు ప్రత్యక్ష ప్రమాణముచేత తెలిసిన పొగను బట్టి నిప్పును ఊహించి నిప్పు ఉన్నదని నిశ్చయింతుము. ఈ నిశ్చయ జ్ఞానమును కలుగజేయు జ్ఞానమును అనుమాన (ఊహ) ప్రమాణమందురు. ఇంద్రియములకు కనిపింపక ఊహించి తెలిసికొనవలసినవి కొన్ని. అవి ధర్మాధర్మములు పాప పుణ్యములు ఆత్మ పరమాత్మలు మొదలైనవి. ధర్మాధర్మాదులను చెవి మొదలైన యింద్రియములచే తెలిసికొనలేము. జీవి సుఖముగా ఉన్నచో ధర్మము చేసెననియు, కష్టములో ఉన్నచో అధర్మము చేసెననియు ఊహింపవలయునే గాని యింద్రియములచే తెలిసికొనలేము. ఇట్లే కారణములచే కార్యములను అనుమానించు అనఁగా ఊహించు జ్ఞానము అనుమానము. ఈ అనుమాన ప్రమాణమును సరిగా అర్థము చేసికొనక పోవుటచే అజ్ఞులు ధర్మాధర్మములు పాప పుణ్యములు ఆత్మ పరమాత్మలు లోకాంతరములు, జన్మాంతరములు లేవనియుందురని ఆస్తికులు. పిల్లినిబట్టి పెద్దపులిని తెలిసికొనుటకు ఉపయోగించు జ్ఞానము ఉపమానము. గ్రామాంతర దేశాంతరములందు జరగిన సంగతులను లోకాంతర జన్మాంతరమందలి ఆ యథార్థములను తెలిసిన యాప్తుల వాక్యమును బట్టి తెలిసికొనవచ్చును. దానిని శబ్దప్రమాణమందురు. పరలోకములు పాప పుణ్యములు ఆత్మ పరమాత్మలు జన్మాంతరములు ఉన్నవని శబ్ద ప్రమాణములగు వేదశాస్త్రాదులు తెలుపును. ఆత్మ పరమాత్మలు సర్వవ్యాపులు అనంతములు శరీర శూన్యములుకాన ప్రత్యక్షములు కావు, ఊహకును అందవు. దేశ కాలాదులచే సంకుచితము లగు వస్తువులు మాత్రమె ప్రత్యక్షములగును. ఈశ్వరుడు ప్రత్యక్షమగు నన్నచో ఆ యీశ్వరుడు సంకుచితుడుగాను అసర్వవ్యాపిగాను నశ్వరుడుగాను అసంపూర్ణుడుగాను ఉండవలసివచ్చును. అట్లే యింద్రియ గోచరములు గాని పాప పుణ్యములను ఆత్మ పరమాత్మ మొదలగువానిని అనుమానాదులచే నిశ్చయింపవలయును. ఇట్లు ప్రత్యక్షము అనుమానము ఉప

మానము శబ్దము అని ప్రమాణములు నాలుగు సృష్టిని సృష్టి కర్తను దెలుపుటకుపయోగింతురు.

ఈ ప్రమాణములను అంగీకరించుటలో అనేక మత భేదములున్నవి. కాన తమ తమ మతములనుబట్టి ఆయా మత కర్తలు అనేకముగా సత్యమును దర్శించిరి. ఆ దర్శనములు అనేకముగా నున్నను మూల భేదమును బట్టి 1 బౌద్ధము 2 నైయాయికము 3 సాంఖ్యము 4 జైనము 5 వైశేషికము 6 జైమినీయము అని ఆరేయనియు దేవతా భేదమును బట్టి మోక్షసాధక తత్త్వమును బట్టియున్నవని హరి భద్రసూరి చెప్పెను. విద్యారణ్యులు ఇంకను కొన్ని ముఖ్యదర్శనములను చెప్పిరి.

చార్వాకమతస్థులు లోకాయతికులు ప్రత్యక్షప్రమాణమునొక్క దానినె అంగీకరించి యింద్రియములకు ప్రత్యక్షముగాని వానిని లేవని యనిరి. జైన[అర్హతములు]బౌద్ధులు ప్రత్యక్షము అనుమానము అను రెండిటినే అంగీకరించిరి. శబ్దప్రమాణమును అంగీకరింపరు నైయాయికులలో ఏకదేశికులు ప్రత్యక్షము అనుమానము ఉపమానము అని మూడింటినే అంగీకరించిరి. ప్రత్యక్షము అనుమానము ఉపమానములు శబ్దముఅని నాలిగింటిని నైయాయికులు వేదాంతు అంగీకరించిరి. సాంఖ్యులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దముల రించిరి. ఈ నాలుగేకాక అర్థాపత్తిఅను దానినిగూడ ప్రాభాకరులు అంగీకనంగీకరించిరి. దేవదత్తుడు బలిసి యున్నాడు పగలు భుజింపడు అనుచోట పగలు భుజింపకున్నను బలిసియున్నాడు కాన రాత్రి భుజించుచున్నాడను నర్థము ఆసన్న మగుచునున్నది. [లభించుచున్నది.] కాన అర్థాపత్తియను ప్రమాణమును గలదందురు. ఇట్లే అనుపలబ్ధిగూడ గలదని ఆరింటిని భాట్టవేదాంతులందురు, రామానుజులును మాధ్వులును ప్రత్యక్షానుమాన శాబ్దముల నంగీకరించిరి. మాహేశ్వరులు ప్రతక్షానుమానోపమాన శాబ్దములనంగీకరించిరి. సాంభవికము ఐతిహ్యముగూడ గలవని ఎనిమిది అనిపౌరాణికులు, చైష్టికము గూడ గలదని తాంత్రికులు అది తొమ్మిదని అందురు.

ఈ ప్రమాణములచేత దెలిసికొని పొందవలసినవి ధర్మార్థ కామమోక్షములనెడి పురుషార్థములు.

మానము శబ్దము అని ప్రమాణములు నాలుగు సృష్టిని సృష్టి కర్తను దెలుపుటకుపయోగింతురు.

ఈ ప్రమాణములను అంగీకరించుటలో అనేక మత భేదములున్నవి. కాన తమ తమ మతములనుబట్టి ఆయా మత కర్తలు అనేకముగా సత్యమును దర్శించిరి. ఆ దర్శనములు అనేకముగా నున్నను మూల భేదమును బట్టి 1 బౌద్ధము 2 నైయాయికము 3 సాంఖ్యము 4 జైనము 5 వైశేషికము 6 జైమినీయము అని ఆరేయనియు దేవతా భేదమును బట్టి మోక్షసాధక తత్త్వమును బట్టియున్నవని హరి భద్రసూరి చెప్పెను. విద్యారణ్యులు ఇంకను కొన్ని ముఖ్యదర్శనములను చెప్పిరి.

చార్వాకమతస్థులు లోకాయతికులు ప్రత్యక్షప్రమాణమునొక్క దానినె అంగీకరించి యింద్రియ ములకు ప్రత్యక్షముగాని వానిని లేవని యనిరి. జైన[అర్హతములు]బౌద్ధులు ప్రత్యక్షము అనుమానము అను రెండిటినే అంగీకరించిరి. శబ్దప్రమాణమును అంగీకరింపరు నైయాయికులలో ఏకదేశికులు ప్రత్యక్షము అనుమానము ఉపమానము అని మూడింటినే అంగీకరించిరి. ప్రత్యక్షము అనుమానము ఉపమానములు శబ్దముఅని నాలిగింటిని నైయాయికులు వేదాంతు అంగీకరించిరి. సాంఖ్యులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దముల రించిరి. ఈ నాలుగేకాక అర్థాపత్తిఅను దానినిగూడ ప్రాభాకరులు అంగీకనంగీకరించిరి. దేవదత్తుడు బలిసి యున్నాడు పగలు భుజింపడు అనుచోట పగలు భుజింపకున్నను బలిసియున్నాడు కాన రాత్రి భుజించుచున్నాడను నర్థము ఆసన్న మగుచున్నది. [లభించుచున్నది.] కాన అర్థాపత్తియును ప్రమాణమును గలదందురు. ఇట్లే అనుపలబ్ధిగూడ గలదని ఆరింటిని భాట్టవేదాంతులందురు, రామానుజులును మాధ్వులును ప్రత్యక్షానుమాన శాబ్దముల నంగీకరించిరి. మాహేశ్వరులు ప్రత్యక్షానుమానోపమాన శాబ్దములనంగీకరించిరి. సాంభవికము ఐతిహ్యముగూడ గలవవి ఎనిమిది అనిపౌరాణికులు, చైష్టికము గూడ గలదని తాంత్రికులు అది తొమ్మిదని అందురు.

ఈ ప్రమాణములచేత దెలిసికొని పొందవలసినవి ధర్మార్థ కామమోక్షములనెడి పురుషార్థములు.

## మతములు – వాని యాశయములు

1) చార్వాక మతస్థులు—ఈశ్వరుడు లేడందురు. వస్తు సమ్మేళనము వలన సృష్టి జరుగునందురు.

2) బౌద్ధులు—సర్వజ్ఞుఁడైన బుద్ధమునియె ఈశ్వరుడందురు.

3) జైనులు—సర్వజ్ఞుఁడైన అర్హతమునియె ఈశ్వరుడందురు.

4) సాంఖ్యులు—జీవునికంటె వేరే ఈశ్వరుడు లేడందురు.

5) మీమాంసకులు—వైదిక కర్మయె ఫల ప్రదాత. కర్మాతిరిక్తమైన ఈశ్వరుడు లేడందురు. కొందఱు మీమాంసకులు ఈశ్వరునంగీకరింతురు.

6) శబ్దోపాసకులు-వైయాకరణులు—మూలచక్రస్థమైన పరావాక్కు, నాభి సంస్థయగు పశ్యంతి, హృదయస్థయగు మధ్యమ, కంఠ దేశస్థమగు వైఖరి, అనువానిలో పరాఖ్యవాక్కే ఈశ్వరుడందురు.

7) రామానుజీయులు—జీవులకు నియంత, జీవాంతర్యామి యై జీవుల కంటె వేఱగు నీశ్వరుడే. జీవ జడ వర్గము వాని శరీరమందురు.

8) మాహేశ్వరులు, నైయాయికులు, వైశేషికులు మాధ్వులు, వీరు ఈశ్వరుడు ఉపాదానకారణము కాదు. జగత్తుకు నిమిత్తకారణము కర్మ ఫల ప్రధాత అందురు.

9) మాహేశ్వరు నకులీపాశుపతులు ప్రత్యభిజ్ఞావాదులు కర్మనుబట్టి గాక స్వేచ్ఛగా ఫలమును ఈశ్వరుడిచ్చునందురు.

10) నైయాయిక వైశేషిక మాధ్వులు—కర్మనుబట్టి ఫలము కలుగునందురు. కర్మసాపేక్షకుడైన ఈశ్వరుడు ఫలదాతయై జగత్తును సృజించునందురు.

11) అద్వైతులు—పరమాత్మ నిర్వికల్పుడు నిర్గుణుడు. అతడు జగత్తుకు నిమిత్తకారణమును, ఉపాదాన (ముఖ్య) కారణమును గాడు. జగత్తుకు పరమార్థసత్త లేదందురు. జగత్సత్త వ్యావహారికము. కర్మనుబట్టి ఫలమగునందురు.

# వే ర్వే రు వా ద ము లు

శ్లో॥ ఆరంభవాద్య కణభక్షవాదః సంఘాతవాదస్తు భదంతపక్షః
సాంఖ్యాదిపక్షః పరిణామ వాదః వేదాంత పక్షస్తు వివర్తవాదః.

ఆరంభ వాదము కణాదుని వాదము. సంఘాత వాదము భదం వాదము. సాంఖ్యాది వాదము పరిణామ వాదము వేదాంతపక్షము వివర్త వాదము అని వాదములు.

ఇవి యాయా దర్శనములలో వివరముగా తెలుపఁబడును.

తంతువులచేత ఆరంభింపబడిన పటము స్వ సమవాయి (ముఖ్య కారణమగు తంతు సముదాయము కంటె గూడ భిన్నమని వారి మతము. ఇది నైయాయిక వైశేషికుల ఆరంభ వాదము.

ఉపాదాన (ముఖ్య) కారణములైన తంత్వాదుల సముదాయమే పటాది కార్యము. కారణమునకంటె వేరు కార్యములేదు. కారణ సంతానమే కార్యము అని సంఘాత వాదము.

సంఘాతము ప్రతిక్షణము క్రొత్త క్రొత్తది పుట్టును అని సౌత్రాంతిక వైభాషిక బౌద్ధులమతము, ఉపాదానకారణము తాను నశించి కార్యమును పుట్టించునందురు. అసత్తే ప్రతిక్షణము భాసించును. అదే అసత్ఖ్యాతి అనబడును. విజ్ఞానవాది బౌద్ధులు విజ్ఞాన రూపమైన ఆత్మయే ప్రతిక్షణముక్రొత్త క్రొత్తగా భాసించునందురు ఉపాదాన కారణము తత్త్వమునకు ఇంకొకటిగా అగుటయే కార్యము. ఇది పరిణామ వాదము. సాంఖ్య, పాంతజల రామానుజుల మతమిది.

అతాత్త్వికమైన కారణాన్యథాభావమే వివర్తవాదము. శంకరానుయాయులమతము. త్రాడేపాముగా భాసించును. ఆత్మయే ప్రపంచముగా భాసించును. ఇవియే వివర్తవాదము.

జీవ ఈశో విశుద్ధాచిత్, తథా జీవేశ్వరయో ర్భిదా
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాక మనాదయః
జీవుడు, ఈశ్వరుడు, విశుద్ధ చైతన్యము, జీవేశ్వర భేదము,
అవిద్య వాని చైతన్యముల యోగము అని ఈ యారువుఅనాదులు.
ఇవియా యా దర్శనములలో వివరముగా తెలుపఁబడును.

## 1. చార్వాకుఁడు

చారు (అందమైన) వాక్కులుగలవాఁడు. అని చార్వాక పదమునకు వ్యుత్పత్తి, అందమైనయనఁగా ప్రియమైన వాక్కులు గలవారిని లోకాయతికు లను పిలిచెడివారు. ప్రియమైన వాక్కులు చెప్పువారు. ప్రియమైన వాక్కులు చెప్పువారు లోకమున ఆయతికులై విస్తరించియేయున్నవారు. వారు తాత్కాలికముగ ప్రియముగా చెప్పుటయేకాని ఆలోచించి ముందు ముందు ఇది అప్రియమగునని తలచి శుభము చెప్పనివారు, కాన నాస్తికులు లోకాయతికులనఁబడిరి. లోకాయతికులనుగూర్చి రామాయణమున ప్రస్తావింపఁబడెను. వారె చార్వాకులుగాఁగూడ పిలువఁబడిరట. చార్వీ అను నాచార్యుడు లోకాయతికుడై యుండెనని కాశిక అను వ్యాకరణగ్రంథమునఁగలదు. చార్వాకుడనువాఁడు దుర్యోధన స్నేహితుఁడొకఁడు గలఁడని భారతమునఁగలదు. ఈ సందర్భములో ఒక కథ కలదు.

బృహస్పతియను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతడు తన భగినితో కలియుటచే బ్రాహ్మణులు అతనిని వెలివేసిరట. అందుచే అతఁడు కోపగించి చార్వాకుఁడను లోకాయతికునిద్వారా బ్రాహ్మణులకు వ్యతిరేకముగా లోకాయతిక ధర్మమును ప్రచారముచేయ పంపినట్లు ఇట్లు జైన గ్రంథములగలదు.

ఇంక చార్వాకుఁడనువాఁడు 661 యుధిష్ఠిర శకమున అనఁగా క్రీస్తు॰ పూ. 2436 సం॥లో వైశాఖమాసమున పౌర్ణమినాడు అవంతిదేశములోని శంఖోద్ధార మనెడిపురమున జన్మించెనట. అతని తండ్రిపేరు ఇందుకాంతుడు. తల్లి పేరు ప్రగ్వీణి. అతడు బృహస్పతియను బ్రాహ్మణుని ప్రోత్సాహమున లోకాయత (నాస్తిక) మతమును ప్రచారముచేసినట్లును పండిత శివశంకరమిత్రుడు తన భారతదేశ ధార్మిక చరిత్ర అను గ్రంథమున వ్రాసెను.

చార్వాక దర్శనమునకు బృహస్పతి సూత్రములు మూలములై యున్నవి. బృహస్పతి దేవగురువై యుండియు నాస్తికమతమున కాధారమైన సూత్రములేల రచించెనను ప్రశ్న గలదు, దాని విషయములో పౌరాణికు లిట్లు చెప్పుదురు. రాక్షసులు వేదములను బాగుగా అధ్యయనముచేసి అందు చెప్పఁబడిన సిద్ధులను సంపాదించి దేవతలను బాధించుటచే బృహస్పతి ఆ రాక్షసులకు వేదములందు విశ్వాసము పోవుటకై వేదములు ధూర్త భాషితములని చెప్పి

నాస్తిక మతసూత్రములను రచించెనట. అందుచే రాక్షసులు వేదకర్మలందు విశ్వాసము విడిచి నాస్తికులై చరించి నశించిరట.

ఈ పై కథలు సత్యములైనను కాకున్నను చార్వాకమతమను పేర నాస్తికమతము ప్రాచీన కాలమునుండి ప్రచారములో నున్నట్లు స్పష్టము. ఆ చార్వాకమతమునే తన సర్వదర్శన సంగ్రహములో (విద్యారణ్యులు) సాయన మాధవులు ప్రారంభమునఁగూర్చిరి.

## 1. చార్వాకదర్శనము

చార్వాకుని మతమున ప్రత్యక్షమొక్కటియె ప్రమాణము, చెవిత్వక్షు (చర్మము) కన్ను నాలుక ముక్కు అను పంచేంద్రియములచేఁదెలియఁబడు వానినిగాక యింకే పదార్థములను అతఁడు అంగీకరింపఁడు, ధర్మాధర్మములు పాపపుణ్యములు పరలోకము జన్మాంతరము భగవంతుడు అనునవి యింద్రియ ములకుఁగనిపింపవు కాన అవిలేవని అతఁడనును—

పరమేశ్వరుఁడు మోక్షమునిచ్చువాఁడని యెట్లు చెప్పనగును. చార్వాకుఁడు బృహస్పతి మతమును అనుసరించువాఁడు, నాస్తిక శిరోమణి. పరమేశ్వరుఁడు మోక్షప్రదాత అను దానిని అతడు పూర్తిగ ఖండించివైచెను, పుణ్య పాపములు అదృష్టములు. వానియందు జీవులకు విశ్వాసముగలుగదు, కనుక ఈ చార్వాకుని మతమును ఖండించుట చాల కష్టము.

కం॥ "జీవించినంతకాలము
జీవింపవలయు సుఖముగ జీవుండెవఁడేన్
చావనివాఁడున్నె, తగులఁబడి
పోవుశరీరంబు తిరుగఁబొడముటయెట్టుల్."

అను లోకగాథనుబట్టి తఱచుగ సర్వప్రాణులును నీతి కామశాస్త్రములను అనుసరించి అర్థకామములె పురుషార్థములు మోక్షముగాదుఅని తలఁచి పరలోకవిషయమును గప్పిపెట్టుచు చార్వాక (చారు=అందమైన, వాకుఁడు=మాటలుగలవాఁడు) మతమునె అవలంబించినవారై కనుపట్టుచున్నారు కనుకనె చార్వాకమతమునకు లోకాయుతము (లోకమున బాగునవ్యాపించినది) అని సార్థకమైన నామాంతరముగలదు.

గీ॥ ఎందులేఁడు దేవుఁడు, మోక్షమేనిలేదు
ధర్మమును లేదు లేదయధర్మమేని
పాపపుణ్యఫల నరక స్వర్గములును
నీకనుఁతే, వనిలోకాయతికులంద్రు (హరిభద్రసూరి)

అందు భూమి నీరు తేజస్సు గాలి యను భూతములు నాలుగు తత్త్వములు.

పృథివ్యప్ తేజో వాయు రితి తత్త్వాని (బృహస్పతి సూత్రము)
లోకాయత పక్షమునన్ నాలుగు భూతాలె తత్త్వము.
భూమియు, నీరు, తేజస్సుగాలి ఇంకేమి లేదటన్ (శంకరుడు)

ఆ నాలుగు తత్త్వములనుండియే దేహాకారము పొందిన వివిధ తత్త్వముల సమ్మేళమువలన మదశక్తులు సురయందు పుట్టుచున్నవి.

తత్సముదాయే శరీరేంద్రియ విషయ సంజ్ఞాతేభ్యశ్చైతన్యం *కిణ్వాదిభ్యో మదశక్తివత్ విజ్ఞానం (బృహస్పతి సూత్రము) వాని సముదాయమందు శరీరము, ఇంద్రియములు, విషయములు అను పేరు కలిగెను. వానినుండి చైతన్యము మాదకబీజముల నుండి మదశక్తివలె కలుగును. అవి నశించినపుడు చైతన్యమును స్వయముగా నశించును. దానినిట్లు చెప్పుదురు. "విజ్ఞానఘన ఏవైభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి (బృ 2-4-12) విజ్ఞానపు ముద్దయైన జీవుఁడె ఈ భూతములవలన బయలుదేఱి పిదప వానితోపాటె నశించిపోవును. నశించినపిదప ఇంక వానికి పేరు ఉండదు

వేడు సెమిళ్ళ చిత్రించు కూయిఁగనుస్ వేడుకోయిలన్
స్వభావంబుకంటె వేరే లేద వేరొక్క హేతువున్
జడమయిన నాలుగుభూతాలఁ బొడము వికృతు
లందు నెట్టియూ చైతన్య మగపడునది
తములపాకు చెక్క సున్నమును గలిసు
నెఱులు నెఱుపు రంగు గలిగె సటులఁ గలిగె

* కిణ్వాదిభ్యః=మద్యాలు కలపెడి కొన్ని బీజములనుండి. కల్లుకు మూలమైన యొక్క తాటి చెట్టు యొక్క రసమునుండి అని వ్యాఖ్య

అట్టి చైతన్యముతోఁ గూడిన దేహమె ఆత్మయనఁబడును.(శంకరులు)

చైతన్య విశిష్టః కాయః పురుషః (బృహస్పతి సూత్రము) చైతన్యముతోకూడిన శరీరమే పురుషుడు అని బృహస్పతి. దేహముకంటె వేరు ఆత్మ ఉండును అనుటలో ప్రమాణములేదు. వీరు ప్రత్యక్షమునే అంగీకరింతురు. అనుమానాదులను ప్రమాణముగా అంగీకరింపరు. కాల్చిన ఇనుపగుండునందు నిప్పునకు ధూమసాహచర్యము లేదు. ఒక్కొక్కచోట ధూమమున్నను నిప్పు లేకపోవచ్చును. కాన అనుమానము ప్రమాణముకాదు. గోపాలఘుటికయందు కేవల ధూమమే కన్పించును.

మహిషమువలె పురుషుడు, మాతంగివలె స్త్రీ ఉన్నారు అనుచోట ప్రమా(నిశ్చయ)జ్ఞానము కలుగుటలేదు కాన ఉపమానమును ప్రమాణముకాదు.

యథార్థ వక్త అనువాడు సంభవింపడు కాన శబ్దమును ప్రమాణము కాదు.

దేవదత్తః దివా న భుంక్తే అనుదానికి రాత్రిభోజనము లేకున్నను ఆమవాతాది రోగములవలన బలసియుండుట సంభవించును కాన అర్థాపత్తియు ప్రమాణము కాదు.

భూతలమందు ఘటములేదు అనెడి ప్రత్యక్షము కేవలము భూతలమున్నప్పుడే ప్రమాణమగును. భూతలముకంటె వ్యతిరిక్తమైన భూతలమందున్న ఆ అభావమున్నప్పుడు ప్రత్యక్షముగాదు. తత్ప్రమేయమైన అభావమే అభావమగుటవలన కనుక అనుపలబ్ధియు ప్రమాణముగాదు. ఐహిక భోగాదులవలనఁగలుగు సుఖమె పురుషార్థము "కామ ఏకైకః పురుషార్థః" బృహస్పతి సూత్రము. విడిచిపెట్టుటకు వీలులేకుండఁబ్రాప్తించిన దుఃఖమును పరిహరించి కొని సుఖము మాత్రమే అనుభవింపఁదగియుండుటవలన "ఈ భోగాదులవలనఁగలిగిన సుఖము దుఃఖముతోఁగలిసినది కాన అది పురుషార్థముకాఁజాల"దని తలఁపరాదు. అది యెట్లన, ధాన్యములనుదినువాఁడు ముళ్ళు ఎముకలు తప్పక్కగల మత్స్యములను తీసికొని వానిలో గ్రహింపఁదగినది గ్రహించి వర్జింపవలసినది వర్జించిపెట్టును. ధాన్యము గోయవాఁడు పొల్లుతోఁగూడిన

ధాన్యములో ఎంత గ్రహింపవలెనో అంతయె గ్రహించి మిగిలిన పొల్లును విసర్జించును. అందువలన దుఃఖముగూడఁ గలుగునను భయముచే అనుకూలముగ నుండు సుఖమును విడచుట న్యాయముకాదు. మృగములున్నవని వరిపైరులు వేయకుందురా. భిక్షుకులున్నారని పొయ్యిమీద వంటపాత్రలు పెట్టుకుందురా? ఎవఁడైనను ఒక పిఱికితనంబు ప్రత్యక్షముగఁగనఁబడు సుఖమును చేతులార విడచుకొన్నచో వాఁడు పశువువలె మూర్ఖుఁడె యగును. ఇట్లని యొకచోటఁ జెప్పఁబడినది.

వ్యథలతోఁగూడియుండు నటంచు నరులు
విషయభోగముల్ విడచుట వెఱ్ఱితనము
పొల్లుగలదని వెఱిబియ్యమొప్పువడ్ల
నెవ్వఁడేని హితైషి త్యజించునొక్కొ.
అవనిఁ బ్రత్యక్షముగఁగాంచునదియె యుండె
అగపడమి నదృష్టం బనునదియెలేదు
ఇల నదృష్టమున్నదను వారలునుగూడ
మనకదృష్టము దృష్టమే ననియు నవరు (శంకరులు)
ఎచటనే నదృష్టముఁగనిపించునెతల
అయ్యది యదృష్టమని యేలయనెదరిందు
నిత్యము నదృష్టమున్నదనియు వచించు
టది చెవులపిల్లి కొమ్మున్నదనుటె యగును।
కనుక నందుకై కష్టంబు ప్రాజ్ఞుఁడు పొందఁగూడదు
తపస్సు, లుపవాసాదుల్, చేసి మూర్ఖుండెచిక్కును (శంకరులు)
కావున దృష్టమున్ వీడి యదృష్టమును లోకులు
కోరుట మూర్ఖత్వమగు, నని చార్వాకులందురు.

అయితే మఱి యదృష్టములగు పరలోక సుఖాదులె లేనపుడు బహు ధనములు ఖర్చుపెట్టి యనేకక్లేశములు పడి సాధించిన యగ్నిహోత్రములు మొదలైన వాని నందు విద్యావృద్ధులైన వారెందుకు ప్రవర్తించుచున్నారు అన్నచో అట్లని విద్యావృద్ధులనఁబడువారు చేసినంత మాత్రమున అది ప్రమాణమెట్లగును?

దానధర్మాలు పూజలు, మృష్టాన్న దాన దక్షిణల్
ఆకలిచేత శుష్కించు, లోకుల్ కల్పనచేసిరి (శంకరులు)

గుళ్లను చలివేందరల్, నూతుల్ సత్రాలు తోటలున్
బాటసారులె శ్లాఘింత్రు, శ్లాఘింపరింక నెవ్వరున్ (శంకరులు)

హింస చేయరాదని యొకచోట, యజ్ఞములలో చేయుహింస హింసకాదని యొకచోట చెప్పి అనృతము లాడుదురు తై. 1-8-6 సంహితలో ఒకడే రుద్రుడని తై. స. 4-5-11 సంహితలో సహస్ర రుద్రులని పరస్పర విరోధములు చెప్పుదురు.

స్వధితేమైనం హింసీః (తై. స. 1-2-1) ఓ కత్తి! వీనిని హింసింపడు. "ఓషధే! త్రాయస్వైనం" (తై. సం. 1-2-1) ఓషధీ! వీనిని రక్షింపుడు. "శృణోత గ్రావాణః (తై. సం. 1-3-13) రాళ్లులారా వినుడు ఇత్యాద్యసందర్భానృతములు పునరుక్తములు పల్కుదురు. కొంగజపములు చేయుచు అమాయకుల మోసగించుచు వైదికులమని తలఁచి కర్మకాండమును ప్రమాణముగా తలచువారు జ్ఞానకాండను, జ్ఞానకాండను ప్రమాణము తలచువారు కర్మకాండను పరస్పరము ఆక్షేపింతురు. దీనినిబట్టి వేదములు ధూర్త ప్రలాపములే. అమాయకుల మోసగించుటకు అవి అపౌరుషేయములందురు, కాని అవి ప్రమాణములు కావు. అగ్నిహోత్రాదులు జీవికకు మాత్రమే ప్రయోజనముగాఁగలవని తెలియవలెను. ఇట్లును చెప్పఁబడినలోకోక్తులుగలవు.

"అగ్నిహోత్రము వేదత్రయము త్రిదండ*
మొంటినిండ బూడిద పూసికొంటయున్ను
బుద్ధి పౌరుషహీనుల పొట్టకూటి
వృత్తులని బృహస్పతి వచియించినాఁడు,"

---

* అథర్వవేదము వేదత్రయాంతర్గతమై [illegible] త్రిదండధారణ చేసి సంన్యాసము గ్రహించుట.

కనుకనె కంటకాదులవల్లఁగలుగు దుఃఖమె నరకము. లోకమున ప్రసిద్ధుడైన రాజె పరమేశ్వరుడు దేహమును వీడుటయె మోక్షము. "మరణమేవాపవర్గః" (బృహస్పతి సూత్రము.) మరణమే మోక్షము

ఇందు నీ లోకమునకంటె నింక వేఱ
లేదు స్వర్గంబు, నరకమును లేదు లేదు
మోసగించ సంకల్పించు మూఢుఁడెపుడు;
కల్పనము చేసిరిటు శివలోకాదికములు (శంకరులు)
ఇహ సౌఖ్యంబె స్వర్గంబు, కష్టాలెనరకంబగున్
ప్రాణవాయువుపోవఁగ, మరణించుటె మోక్షము (శంకరులు)

కనుకనే స్థూలమైనవాఁడను, నేను సన్నని వాఁడను నేను నల్లనివాఁడను అని విశేషణ విశేష్య భావము పరివడును.

నేను స్థూలుండ వృద్ధుఁడ, నిట్టి విశేషణాలతోఁ
గూడినదే యాత్మ[illegible]ను, వేఱైనదాత్మకాదిఁకన్ (శంకరులు)

రాహువుయొక్క శిరస్సు అనుచోట (విష్ణుచక్రము తెగగొట్టిన రాక్షసునితలను రాహువు అని మొండెమును కేతువనియు అందురు.) రాహువుయొక్క శిరస్సు అనఁగా రాహు రూపమైన శిరస్సుఅని యర్థము చెప్పుకొనునట్లుగానె ఇది నా శరీరము మొదలైన వ్యవహారములలో నా స్వరూపమైన శరీరము మొదలైన యర్థములను గ్రహింపవలెను. ఈ పై విషయమంతయు ఈ క్రింద సంగ్రహింపఁబడినది.

ఇహలోకంబునంగల్గు, సుఖంబె పురుషార్థము
కంటకాదివ్యథంగల్గు, దుఃఖంబె నరకంబగున్।
లోకప్రసిద్ధుఁడౌ రాజె, యీశుఁ; డన్యుఁడు గాఁడిలన్
దేహనాశంబె మోక్షంబు, జ్ఞానాప్తిన్ ముక్తి కల్గదు।
భూమి నీళ్లగ్ని గాలి నా, నిందునాలుగె భూతముల్
ఈ నాల్గుభూతములచేఁ, జైతన్య ముద్భవించును।
ద్రవ్యంబులొండొండుచేర, మదశక్తులు పుట్టును

దేహాత్మలొక్కటేగాన, స్థౌల్యాదు లుపపన్న మే।
స్థౌల్యాదులుండుటంబట్టి, మేనెయాత్మ మటొండు కొ
దీ మేను నాదియన్మాట, యౌపచారికమైనది

రాహువుయొక్క శిరస్సు అనుచోటవలె నామేను అనుచోట లక్షణవల్ల అర్థము సరిపోవును. (ఔపచారికము=లాక్షణికము)

"సరే యిది యిట్లేయగుఁగాక, అనుమానాదులు ప్రమాణము కాకపోయినప్పుడును, పరలోకమన్నది లేకపోయినపుడును"—ఇహలోకభోగములవల్లఁ గలుగు సుఖమె పురుషార్థములు "అని యందము, అట్టి నీ మనోరథము అట్లే యుండనిమ్ము, కాని అనుమానాదులకు ప్రామాణ్యము గలదు గదా, అనుమానమె ప్రమాణముకానిచో పొగను జూచినపిదప ప్రేక్షకులకు అగ్నియందు ప్రవృత్తి దేనివల్ల గలుగును, నదీతీరమున పండ్లున్నవి అని విన్న పిదప పండ్లుకోరువారికి నదీతీరమునకు పోవవలయునని ప్రవృత్తి గలుగుచున్నదికదా."

అనెడి యనుమానవాదుల పై వాక్యములు మనోరాజ్యమునఁగలుగు విహారములె విజృంభణములె కాక వేఱుకావు. సరే దీనిని పరిశీలింతము.

వ్యాప్తితోఁగూడిన పక్షధర్మతాశాలియైన లింగము కారణము అది జ్ఞానమునకు గమకమనిగదా అనుమాన ప్రామాణ్యవాదులు అంగీకరించిరి, వ్యాప్తి యనఁగా సాధర్మ్య వైధర్మ్యములతోఁగూడి రెండువిధములైన యుపాధులు లేని సంబంధము. ఉపాధిగల హేతువును హేత్వాభాసమందురు. పైకె హేతువుగా అభాసించి సరియైన హేతువుకాని దానిని హేత్వాభాసమందుః. సాధ్యమందు వ్యాపకముగా నుండి (తప్పనిసరిగా ఉండి) సాధనమందు వ్యాపకముగనుండనిదానిని ఉపాధియందురు. ఉదా:- పొగగలదగుట వలనఁబర్వతము నిప్పుగలది. అనుచోట పొగగలదగుటవల్ల అను హేతువుచే పర్వతము నిప్పుగలది అని సాధింపఁబడుచున్నది. కాన ఇక్కడ సాధ్యము నిప్పు, ఎక్కడెక్కడ పొగయున్నదో అక్కడక్కడ నిప్పుండును. వంట యింటిలో పొగయున్నపుడెల్ల నిప్పుగనిపించుచునే యున్నది. కాన పొగ

**అసువు**-ప్రాణము మొదలైన జీవక్రియా నిమిత్తకమైనది.

**అసూయ**- ఇతరుల సౌభాగ్యము, సంపత్తి, విద్య, శౌర్యము, మొదలగు హేతువులచే సుగుణమందుకూడదోషా రోపముఁజేయుట.

**అసంగము**- జ్ఞానభూమికాసప్తకమున మూఁడవదియగు తనుమానసియను భూమిక, సంగము లేకుండుట.

**అసంప్రజ్ఞాతము**- ధ్యానింపఁబడు వస్తువు చక్కగా ననుభవింపఁబడ కుండుట.

**అసంప్రజ్ఞాతసమాధి**- మనోలయము, అనఁగా వాయువును సుషుమ్నా నాడి మార్గముగ బ్రహ్మరంధ్రమునఁజేర్చి, ప్రణవనాదముల వినుచు, మనసును చొక్కించి, నాదాంతర్గతమగు జ్యోతిని దర్శించి, యదియే తానను దృఢ నిశ్చయముతో సర్వమును మఱచి, నిశ్చలానందమున నుండుట.

**అసంప్రజ్ఞాతబాహ్యాంగములు**— ధారణ, ధ్యాన, సమాధులు.

**అసంభవదోషము**- ఒక లక్ష్యమునకుఁ జెప్పఁబడిన లక్షణము నాలక్ష్యమం దెంతమాత్రను లేకుండుట.

**అసంభావన**- సంశయము.

**అసంభూతి**- ప్రకృతి, ప్రకృతికారణము అవ్యాకృతము, అవిద్య, సంభూతి, అసంభూతి, ఇవి సమానార్థకములు.

**అసంసక్తి**- జ్ఞానభూమికలలో నొకటి.

**అస్వప్నుఁడు**— పగటియందు నిద్దుర పోవనివాఁడు, దేవత.

**అహంకారము**— అంతఃకరణ చతుష్టయములలో నొకటి. అంతఃకరణము యొక్క తామసభాగము.

**అహంబ్రహ్మాస్మి**— మహావాక్య చతుష్టయములలో నొకటియగు యజుర్వేదములోని బృహదారణ్య వాక్యము.

**అహంగ్రహోపాసనము**- ప్రణవోపాసనము. బ్రహ్మమును నాత్మగ గ్రహించిచేయు నుపాసనము. ఉ॥ దహర, శాండిల్య, ఉపకోసలాది విద్యలు.

**అహింస**- మనసా, వాచా, కర్మణా, ఏ ప్రాణికిని కీడుచేయకుండుట.

**అహీనయానము**- ఒక కర్త చేతనే నడిపించఁబడు యాగము.

**అక్షము**- రుద్రాక్షము, ఇంద్రియము, కన్ను, జపమాల, జూదము, జూదరి.

**అక్షమౌనము**- ఇంద్రియముల స్వేచ్ఛగఁ బోనివ్వక నరికట్టుట.

**అక్షయపాత్ర**- భిక్షాపాత్రము, ముష్టి.

**అక్షయము**- నాశములేనిది.

**అక్షరము**-నాశములేనిది, పరబ్రహ్మము, ముక్తి, శబ్దముయొక్క సంజ్ఞ.

**అక్షసరము లేక అక్షమాల**-తావళము జపమాల, అకారము మొదలు క్షకారమువరకు నక్షరక్రమముతో జపించుట కుపయోగించునది కావున

సక్షమాల యనఁబడెను.

**అక్షిణి-** జాగ్రదవస్థయందుఁ గంటి యందుఁదోచు పురుషుఁడు.

**అంగప్రదక్షిణము-** తనకుతానే కుడి వైపుగఁ బ్రార్థనాది సమయములందు దిరుగు నాత్మప్రదక్షిణము.

**అంగన్యాసము-** సంధ్యావందనాదు లందు నాయాయవయవములను స్పృశించుచు, నా యా దే వ త ను నావాహనముఁజేయుచు,హృదయాయ నమః శిరసేస్వాహా, శిఖాయవౌషట్, కవచాయహుం, నేత్రత్ర యాయ వషట్, అస్త్రాయఫట్ అని యుచ్చ రింపుచుజేయు క్రియలు.

**అంగమేజయత్వము-** ఒడలు వణఁకుట. (అంగం+ఏ జయత్వం)

**అంగశుశ్రూష-** గురునకు కరచరణా దుల నొత్తుట, లేక సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు, రుద్రాదులే కనులు మొదలగు నవయవముల విమర్శించి యెఱుఁగుట.

**అంగావబద్ధోపాసనము-** యజ్ఞకర్మల కంగములుగననుష్ఠింపఁబడువిద్యలు. ఇవి కర్మసమృద్ధంబు లనఁబడును.

**అంగిరసములు-** అవయవములు.

**అంగుష్ఠమాత్రి పురుషుఁడు-** పరబ్రహ్మము, జీవుఁడు.

**అంజనము-** కాటుక, మంత్రగాని కాటుక, తలంటు, సిరా, నిప్పు, పడమర దిక్కునందలి దిగ్గజము.

**అంజలి-** చేమోడ్పు, నమస్కారము.

**అండజములు-** గ్రుడ్లవలనఁ బుట్టినవి.

**అండము-** గ్రుడ్డు, వృషణము.

**అండాండము-** భూచక్రము.

**అంతశ్శరీరము-** హృదయపుండరీకము

**అంతఃకరణము-** మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు.

**అంతశ్శత్రువు-** మనలోపలి శత్రువు, హితశత్రువు.

**అంతఃకరణవృత్తులు-** సంకల్ప, అధ్యవసాన, అభిమాన, అవధారణలు

**అంతఃకుంభకము-** అష్టవిధప్రాణా యామములఁ జూడుఁడు.

**అంతఃప్రణవము-** బ్రహ్మమును బోధించుటకై వ్యవహారార్థము కల్పింపఁబడిన ప్రణవము.

**అంతర్దృశ్యానువిద్ధ సవికల్పసమాధి** కామాది స్వజ్ఞప్తి పర్యంతముఁగల వృత్తులు తనయందుకలిగినపుడువాని నన్నింటికి విలక్షణమైన పరబ్రహ్మము తానని భావించుట.

**అంతరనవవిధ ప్రపంచములు-** కర్త, కర్మ, హేతువులగు బాహ్య త్రిపుటులు మూఁడు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములగు నంతరత్రిపుటులు మూఁడు, ద్రష్ట, దర్శన, దృశ్యము లగు మధ్యత్రిపుటులు మూఁడు, ఇవి యన్నియుఁగలసి నవవిధ ప్రపంచ ములనఁబడును.

**అంతర నిర్వికల్పసమాధి-** బాహ్యాం తరవృత్తి శూన్యమై అఖండ పరిపూర్ణ

అటువంటి వ్యాప్తి ఉపాధిలేని సంబంధ సత్తతో కన్ను మొదలగు వానివలె జ్ఞానరూపముగానే గాని అంగముగా నైక్యము పొందుటలేదు. ఇంక ఆ జ్ఞానమునకు ఉపాయమేది. అందు ప్రత్యక్షము జ్ఞానమునకు ఉపాయము కాదు. పోనీ ప్రత్యక్షము వ్యాప్తి జ్ఞానమునకు ఉపాయమన్నచో అప్రత్యక్షమును బాహ్యమా? అభ్యంతరమా? ఏది. బాహ్యమని యనరాదు. అది బాహ్యేంద్రియముల సాయమువే బాగుగాఁ బ్రయోగించిన విషయ జ్ఞానమును గలిగించుటచే బాహ్యవస్తుజ్ఞానము వర్తమాన కాలములోని వస్తువులపైని ప్రసరించుట సంభవించినను భూతభవిష్యత్కాలములలో అది సంభవింపక పోవుటచేత సర్వమును ఇముడించుకొను (సాహచర్యరూప) వ్యాప్తిని తెలిసికొనుట కష్టము. వ్యాప్తిలో అదిత్రైకాలిక ధూమాదులకు సంగ్రాహకము కారణ కార్యరూపవ్యక్తులకు అవినాభావము (అదిలేకపోయినచో ఇదికాదు అనునది) లేకపోవలసివచ్చును కాన వ్యాప్తిజ్ఞానము సామాన్యగోచరము మని తలపరాదు. భూతభవిష్యత్తులలోఁగూడ ధూమత్వాగ్నిత్వజాతులు ప్రత్యక్షమగునుగదా అన్నచో వ్యక్తులకు సామాగ్న్యులకు వ్యాప్తి జ్ఞానము సంభవింపదు గాన ధూమముచే అగ్నిని అనుమానించుట మామూలుగానే యుండును గాన ధూమత్వాగ్నిత్వ జాతి సామాన్య గోచరమగుననియు తలపరాదు. ఇంక అభ్యంతర ప్రత్యక్షము జ్ఞానోపాయమందమా అట్లును అనరాదు. అంతఃకరణము బహిరింద్రియములపైకి ఆధారపడియుండునది గాన బాహ్యార్థములలో స్వతంత్రముగా ప్రవర్తించుట యనుపపన్నమగును, అదియు ఇట్లు చెప్పఁబడినది.

చక్షురాద్యుక్త విషయం పరతంత్రంబహిర్మనః (త. వి. 20)

సూ. చక్షురాది బాహేంద్రియములచేత ప్రదర్శింపఁ
బడిన రూపాదులు విషయముగాఁగల మనసు
బాహ్యేంద్రియాధీనము." (తత్త్వవివేకము 20)

ఇంక అనుమానముగూడ వ్యాప్తి జ్ఞానమునకు ఉపాయముగాదు, అపుడు అందులో అక్కడలాగే ఇక్కడ (వంటయింటిలోవలెనే పర్వతమందును) ఇట్లు అని వంటయింటిలోనున్న పొగచేతవలెనే పర్వతమందు, పర్వతమందు వలెనో యింకొకచోట అని ఒకదానిపైని ఇంకొకటి, దానిపైన ఇంకొకటి అని యిట్లు ఒకదానిమీద ఇంకొకటి దానిపైనిని కొకటి ఆధారపడుటద్వారా అంతు

లేని అనవస్థా దోషముపట్టును. అగ్న్యాదులకు సాధనమైన ధూమాదులందున్న వ్యాప్తి ఏయనుమానముచే కలుగుచున్నదో అదియింకొక యనుమానముచే కలుగును. అది యింకొక యనుమానముచేత అని యిట్లు అంతులేని అనుమానములచేత అనవస్థాదోషమువట్టును. కాన అనుమానము వ్యాప్తిజ్ఞానోపాయుగుననరాదు.

ఇంక శబ్దప్రమాణముగూడ అజ్ఞానోపాయము కాదు. ఆశబ్దప్రమాణము కణాదమతము ననుసరించి యనుమానమందె యంతర్భవించును. ఒకవేళ అంతర్భవింప దనియందమన్నను పెద్దల వ్యవహారము అనెడి లింగజ్ఞానమును ఆశబ్దప్రయాణము అపేక్షించునదికాన ఇదివరలోఁ చెప్పఁబడిన దోషములనుదాట లేదు. ఆదోషములు దీనిలోమపట్టును. ఇంక నిప్పులేకుండ పొగ యుండదని ధూమాగ్నులకు అవినాభావమున్నదను మాటలును మన్వాది వాక్యములు ప్రమాణముకానట్లే ప్రమాణములుగావు కాన వీనియందు మాకు విశ్వాసములేదు. అవినాభావమును గూర్చి యుపదేశముపొందని మనుష్యునికి ఇతరవస్తువులను జూచుటచే ఇంకొకవస్తువునుగూర్చి అనుమానము కలుగకపోయినపుడు స్వార్థానుమానము కథాప్రాయము కావలసినచ్చును. తనకె అనుమానముచే వస్తుజ్ఞానము సిద్ధింపనపుడు ఇతరులకెట్లు బోధింపగలుగును కాన పరానుమానమెక్కడిది.

సరే ఉపమానము గూర్చి అసలే చెప్పనక్కరలేదు. అవి (అప్రమాణములు) పదములకుఁ బదార్థములకుఁ గల సంబంధమును బోధించుటచేత ఔపాధికములనె కాని ఔపాధికములుగా నట్టి సంబంధమును బోధంచుట సంభవింపదు. దీనిభావమిది—“వ్యాప్తిని సూచించు వాక్యము సత్యమని సిద్ధించినఁ గదామనము అనుమానమును ప్రమాణముగా స్వీకరించుట. ఎక్కడెక్కడ పొగయున్నదో అక్కడక్కడ నిప్పు ఉన్నదని చెప్పుటకు మనము మాత్రము అన్నిప్రదేశములను జూడఁగలమా ? ప్రత్యక్షమె కొన్నిహద్దులలో ఉన్నిప్పుడు వర్తమానకాలములోనె పొగతోఁగూడిన నిప్పుగల ప్రదేశము

లను అన్నిటిని చూడలేనప్పుడు ఇంక భూతభవిష్యత్కాలములలో అన్ని స్థలములనెట్లు చూడఁగలము. ఇట్టిస్థితిలో వ్యాప్తిజ్ఞానము సత్యమని నిరూపించుట యెట్లు!

ఉభయు విధోపాధిరహితమగు వ్యాప్తి యనుమానమని అనిరిగదా. ఆ ఉపాధిలేనివానిని దెలిసికొనుట కూడ కష్టమె. ఉపాధులు ప్రత్యక్షముగా నుండునను నియమము అసంభవమగుటచేత ప్రత్యక్షముల యభావము ప్రత్యక్షమైనను ఆ ప్రత్యక్షముల అభావము అప్రత్యక్షమగుటచేత యనుమానమును అపేక్షించినపుడు పైని చెప్పిన దూషణములు నివర్తింపవు.

ఉపాధి యనఁగా సాధింపదగినదానియందు వ్యాపకముగానుండి సాధనమందు వ్యాపకముగా నుండనిది ఉపాధి. పర్వతము పొగగలది కాన కాల్చిన యినుపగుండునందు నిప్పు ఉన్నను పొగలేదు కాన సాధనమందు వ్యాపకముగా లేనిది గాన ఇది యుపాధియనబడును.

మఱియు సాధనమందు సాధ్యము వ్యాపకముగలేనపుడు సాధ్య సమ వ్యాప్తి అగును అని ఆయుపాధికి లక్షణము చెప్పవలసియుండును. సాధ్య సమమనునది హేత్వాభాసము. పక్షదృష్టాంతాదులలో తుల్యత్వమును ప్రసక్తముచేయుట సాధ్యసమయము.

ఉదా– "శబ్దము అనిత్యము ఉత్పన్నమగుటవల్ల" అను ననుమానములో సకర్తృకమగుటవల్ల ఘటత్వమగుటవల్ల శ్రావణమగుటవల్ల అనునవియుపాధులు. ఇందు వ్యావర్తనము చేయుటకు మూఁడు విశేషణములు స్వీకరింపబడినవి. కనుక సమాసమేత్యాదికముగా ఆచార్యులచేఁ జెప్పఁబడినది నిర్దుష్టము. సమాసమములు అవినాభావములు ఒక్కచోటనెప్పుడు ఉండునో అప్పుడు సమాసమములు అవినాభావము ఉండును. వ్యాప్తి సమవ్యాప్తి అసమవ్యాప్తి అని రెండురకములు. సమనియతములు రెండిటిలో ఒకదానిలో నింకొకదానికి వ్యాప్తి సమవ్యాప్తి.

ఉదా :– పృథివీత్వగంధములు అసమనియతములు. రెండిటిలో ఒకదానిలో నింకొకదానికి వ్యాప్తి అసమవ్యాప్తి.

ఉదా: అగ్నితో ధూమమునకు. ఇనుపగుండునందు నిప్పు ఉన్నను పొగ లేకపోవుటచేత అగ్నిధూమములు అసమనియతములు. అగ్నితోగూడిన ఆర్ద్రేంధన సంయోగము [తడికట్టెల సంబంధము] నందు పొగతోగూడ అసమవ్యాప్తి. ధూమార్ద్రేంధన సంయోగములు సమనియతములు. అగ్నితో ఆర్ద్రేంధన సంయోగమందున్న వ్యాప్తి అసమవ్యాప్తి అట్లుగాక ఒకఆర్ద్రేంధన సంయోగమునందు ధూమముతో సమవ్యాప్తి. అగ్నితో అసమవ్యాప్తి కలదు. కనుక ఇట్లు వ్యాప్తి ద్వయము ఉండును. అసమానములైన ధూమాగ్నులతో హీనము అసమమైన అగ్ని సమమైన ధూమాగ్నులతో హీనమైన యగ్ని అప్రయోజకము ధూమరూపసాధ్యమును సాధింప హేతువుగాదు. అని గ్రహింపవలెను.

సమాసమా వినాభావావేకత్ర స్తోయదాతదా
సమేన యది నోవ్యాప్త స్తయోర్హీనోఽప్రయోజకః
అని ఖండనఖండఖాద్యటీక ఏకత్ర-పదార్థే.

అందు నిషేధ నిశ్చయమువిధి నిశ్చయపూర్వకమగుట ,(ఒకటేయున్న దని నిశ్చయమున్నఁగదా అదిలేదని నిశ్చయించుట) వల్ల ఉపాధిజ్ఞానము కలుగఁగా ఉపాధ్యభావవిశిష్ట సంబంధరూపమయినది. వ్యాప్తిజ్ఞానమునకు అధీనమైనది. కనుక అన్యోన్యాశ్రయ దోషము ఇక్కడ పొగొట్టరానిదగు చున్నది. కనుక అవినాభావము [అదిలేనిచో ఇదిలేదు. నిప్పులేనిచో పొగ యుండదు ] అనునది దుర్భేదము. కాన ఇట అనుమానమునకు అవకాశము లేదు. ధూమజ్ఞానము కలిగినపిదప అగ్న్యాదిజ్ఞానమందు ప్రవృత్తి ప్రత్యక్ష మూలకముగాఁగాని భ్రాంతిచేఁగాని యుక్తమగును. కొన్నిచోట్ల ఫలప్రాప్తి మణి మంత్రౌషధాములచేతవలె యాదృచ్ఛికము కనుక దానిని అదృష్టాదులు సాధింపవు ఐతే అదృష్టమును అనిష్టమును అగు జగద్వైచిత్రమును ఆకస్మిక ముగానగు నన్నచో అట్లుచెప్పుట భద్రముగాదు. ఏలయన అది స్వభావముగనే యుపపన్నమగును.

సుఖదుఃఖాలచే ధర్మా, ధర్మాదులు కల్పింపగూడదు
తనంత జీవిసౌఖ్యాదుల్, పొందు, లేదన్యహేతువు [శం॥]
వేఁడు నెమిళ్ళఁ జిత్రించు వేఁడు కూయించుఁ గోయిలన్
స్వభావంబుకంటె వేఱె, లేదు వేఱొక్క హేతువు [శం]
అదియు ఇటులఁ జెప్పబడెను—

అంబువులు చల్లవైనవి యగ్ని వేడి
వాయువో సమశీతోష్ణమై వరలుచుండు
ఎప్పుడిట్టులు వీనిఁ జిత్రించినాఁడు
అవిస్వభావముచేతనె యట్టులుండె.

ఇదియంతయు బృహస్పతిచేఁ గూడఁ జెప్పఁబడెను.

స్వర్గమును లేదు లేదు మోక్షమునుగాని
మఱియుఁ బారలౌకికపుటాత్మయునులేదు
ప్రకట వర్ణాశ్రమాది ధర్మంబులందు
వాకొనఁబడు క్రియలు ఫలప్రదముగావు.

అగ్నిహోత్రము వేదత్రయమ్ము త్రిదండ
ధారణము, మేనున విభూది దాల్చుకొనుట
బుద్ధిపౌరుష హీనుల పొట్టకూటి
వృత్తులుగ విధాత భువి సర్జించినాఁడు

చంపఁబడి జ్యోతిష్టోమ సవనమందుఁ
బశువు స్వర్గభోగంబులఁ బడయునేని
అట్టి స్వర్గభోగములకై ఆత్మజనకు
నేల యజమానుఁడెపుడు హింసింపఁబోడు

మృతిచెందినప్రాణికిన్, పాథేయ మిచ్చుటల్ వృథా
ఇంటిలో శ్రాద్ధముల్ పెట్ట, దారిలోఁ దృప్తి గల్గునే,
దానంబు ధర్మమున్ జేయు, స్వర్గస్థుల్ తృప్తి పొందుచో
మేడపైనున్న వారికిన్, క్రింద నేటికిఁ బెట్టరు.

బ్రతికినంతవరకు బ్రతుకుము సుఖముగా
ఋణముచేసియైన ఘృతము త్రాగు
పుడమిఁజచ్చి కాలి బూడిదై పోయిన
దేహమెట్టులు భువిపైకిఁ దిరిగి వచ్చు.

(త్రిభిశ్చకరణై స్సమ్యల్। హిత్వావైష యికీం క్రియా। స్వాత్మైవచింతనం యత్తదీశ్వర ధ్యానమీరితం)

**ఈశ్వరప్రణిధానము-** ఈశ్వరుని వాఙ్మనఃకాయ కర్మల చేత స్తుతి, స్మరణ, పూజల నొనర్చుట.

**ఈశ్వరుఁడు-** బ్రహ్మమునందు కల్పితుఁడైన మాయాప్రతిబింబుఁడు. సృష్ట్యాదులొనర్చువాఁడు. (మాయ, తద్విశిష్టచిదాభాసుఁడును, తదధిష్ఠాన చైతన్యమునుఁ జేరి యాశ్వరుఁడనఁబడును.)

**ఈషణత్రియము-** ధనేషణ, దారేషణ, పుత్రేషణలు. ఈషణమనఁగ కోర్కె.

**ఉ-** శివుఁడు, విష్ణువు, శిరస్సు, కన్ను.

**ఉత్కటాసనము-** పశ్చిమతానాసము.

**ఉచ్ఛ్వాసము-** రేచకము. (ఊపిరిని ముక్కులనుండి వెలికి వదలుట)

**ఉచ్చి-** బ్రహ్మరంధ్రము లేక మాడు పట్టు)

**ఉజ్జాయిని-** నోరు మూసికొని కంఠము మొదలు హృదయమువరకున్ను వాయువు నిలుచునట్లుగ నిడాపింగళలచేత వాయువు నాకర్షించి పూరించి శిరస్సు మొదలు కాలిగోరు వరకును వాయువును నిరోధించుట.

**ఉడ్యాణపీఠము-** అజ్ఞాచక్రము.

**ఉడ్యాణబంధము-** కుంభకాంతమునను రేచకమునకుమొదటను, నాభికిమీఁది క్రింది భాగముల వెనుకకు లాగుచుండు పద్ధతి.

**ఉత్కటాసనము-** రెండు కాళ్ళతోఁ గూర్చుండి గొంతును చాచియుండుట.

**ఉత్తమ కుంభకము-** ప్రాణాయామ సమయమున శరీరోత్థితిఁ గలిగియుండుట.

**ఉత్తమ ప్రాణాయామము-** మూఁడు ఉద్ఘాతములు లేక ముప్పదియారు మాత్రల కాలమువరకుచేయునట్టి ప్రాణాయామము.

**ఉత్తమాంగాసనము-** పద్మాసనస్థుఁడై చేతుల నేలనూని, శిరస్సును వంచియుంచుట, కొందఱు కుక్కుటాసనస్థుఁడైయుండి, తలను క్రిందికి వంచియుంచుట, ఉత్తమాంగాసన మందురు. దీనిని లౌల్యాసనమనియు జెప్పుదురు.

**ఉత్తరమీమాంస-** వ్యాసరచితమగు బ్రహ్మసూత్రములతో నొప్పి మంత్రవాదంబైన దేవతాలక్షణములఁ బ్రతిపాదించెడి దేవకాండమున్ను, నాలుగధ్యాయములు గలిగి పరబ్రహ్మమును ప్రతిపాదించు బ్రహ్మకాండమున్ను గల వేదాంత గ్రంథము. పూర్వమీమాంస జూడుడు.

**ఉత్తరాఘము-** భగవత్సమాశ్రయణానంతరము, దేహావసాన పర్యంతము పూర్వవాసనాబలముచే చేయఁబడు చేతన కృతకర్మము.

**ఉత్తరాయణ పుణ్యకాలము-** మకర సంక్రాంతి లేక పెద్దపండుగ యని చెప్పఁబడుచుండు సూర్యుఁడు మకర రాశిలోఁ బ్రవేశించుదినము. శేషుఁడు భూమిని కుడి భుజము నుండి ఎడమ భుజమునకు మార్చుకొనుననియు, ఆ దినమే సంక్రాంతి

# సర్వదర్శన సంగ్రహము

ఇది సాయణమాధవ శంకరాది రచితమై చర్ల వెంకమనారాయణశాస్త్రిల
తనయుండైన చర్ల గణపతిశాస్త్రిచేం దెనిఁగించబడిన
సర్వదర్శన సంగ్రహమున చార్వాకదర్శనము.

---

* సృణ్యేవ, జర్భరీతుర్ఫరీతూ, నైతోశేవ పర్ఫరీకా
ఉదన్యజేవ, జేమనా,మదేరూతా, మేజరాయ్వ జరంమరాయు.
[ఋగ్వేద 10. 0.6.6.]

## ఇది అశ్వినీకుమార ప్రార్థనము

సృణ్యే ఇవ=అంకుశార్హావివ=మత్త గజములవలె, జర్ఫరీ=గాత్రమును వంచుచున్నవారై తుర్ఫరీతూ=హంతలై, నైతుశేవ =సతతము సంతోషముఁగూర్చుచున్నవారై ఫర్ఫరీకా=స్తోతలకుధనమిచ్చువారై = ఉదన్యజేవ = జలజాతము వలె నిర్మలులై, జేమనా = జయశీలురై, మదేరూ =మత్తులైన అశ్వికులు, మే=నాకు, జరాయు మరాయు =జరామరణములను అజరం =పోగొట్టుదురు గాక.

# బుద్ధ భగవానుని చరిత్ర

బీహారులో 'కంకజోలు' జిల్లాలో కపిలవస్తునుండి దేవదహపట్టనము పోవునపుడు లుంబినివనములో శాక్యకులమున శుద్ధోదనునకు మాయాదేవి యందు క్రీ. పూ. 623 సం॥ వైశాఖపూర్ణిమనాడు గౌతముడు పుట్టెను ఈతనిని కనిన ఏడవరోజుననే తల్లి మరణించెను. రాజు రెండవభార్య గౌతమి పెంచెను. కాన ఇతనికి గౌతముడని పేరుగలిగెను. అసలు మొదటిపేరు సిద్ధార్థుడు. పదునారేండ్ల వయసులో పినతండ్రికొడుకు దేవదత్తుడు పడగొట్టిన హంసను రక్షించెను. అప్పటినుండి దేవదత్తునికి గౌతముడనగా అసూయ.

గౌతముడు యశోధర అను నామెను వివాహమాడెను. గౌతమునికి భార్యమీంద ఎక్కువ అనురాగము గలదు. ఒకనాడు గౌతముడు పట్టణము చూడ బయలుదేరెను ఆపట్టణములో అతడు ఒకముసలివానిని, రోగిని మృతునిజూచి తనకును అందరికివలె ముసలితనము రోగములు మృత్యువును రాకతప్పవని రథము నడుపుచుండకునివల్ల తెలిసికొని అప్పటినుండి ముసలితనము రోగము చావు అను భయమువడి వానినుండి తప్పించుకొను ఉపాయము తెలుసుకొన మొదలుపెట్టెను. తనకు రోగమృత్యువులు రావని బాధ్యతవహించిన ఇంటనుందునని కూడ తండ్రితోననెను. మరల ఒకరోజు ఒకసంన్యాసినిజూచి సంన్యాసమువలన ముసలి రోగము మృత్యువు లనుండి తప్పించుకొనవచ్చునని విన్ని భార్యను, కొలదిదినముల క్రిందటనే పుట్టినకుమారుడు రాహులుని, విడిచి సన్యాసియైపోయి తపస్సుచేసెను. నలువది దినములు ఆహారముతినక తపస్సుచేసి చిక్కిపోయి స్మృతిలేక పడిపోయెను. అప్పుడొక గొల్లవాడతని నోటిలోపాలుపోసెను పిదప స్మృతిపొంది జ్ఞానముపొందుటకిది మార్గముకాదని కొంచెముగా ఆహారము తీసికొనెను. ఇది చూచి యడివిలో ఇతని అనుసరించిన సన్యాసులయిదుగురితడు భ్రష్టుడయ్యెనని అతని, విడిచి వెళ్లిపోయిరి. ఒకనాడు సుజాత అనురైతు కూతురు తనకు కుమారుడు పుట్టినచో దేవతకు పూజచేయుదునననెను. కొడుకుపుట్టెను. అందుచే ఆమెసఖులు నైవేద్యముతెచ్చి బోధివృక్షముక్రింద ధ్యానములోనున్న గౌతముని జూచి తమదేవత ప్రసన్నమయ్యెనని అతని దగ్గర పెట్టిరి. దానిని గౌతముడు తిని జ్ఞానియై అవిద్యవల్లి

ప్రణవాధికారియే యీ త్రిపుండ్ర ములధరింప నర్హుఁడని వాసుదేవోపని షత్తు ఆజ్ఞాపించుచున్నది.

**ఊర్ధ్వము-** పొడవైనది. ఉపరితలము.

**ఊర్ధ్వరేతస్కుఁడు-** అస్ఖలితేంద్రి యుఁడు. శివుఁడు. జితేంద్రియుఁడు. ఋషి.

**ఊర్మి-** కెరటము లేక అల.

**ఋ-** ఆకాశము.

**ఋక్కులు-** పాదమునకిన్నియక్షరము లుండవలయునను నియమముఁగల గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్ మున్నగు ఛందోబద్ధములగు మంత్ర విశేష ములు. ఋక్కు అనగా వాక్కని యర్థము.

**ఋగ్వేద జన్మస్థలము-** హిమాలయ పర్వతమునకు దక్షిణము,శతద్రునదికి పడమర, సిందూనదమునకు తూర్పు గాఁగల ప్రదేశము. శతద్రు నదిని ఇప్పటివారు సట్లెజ్ (SUTLEJ) అందురు.

**ఋగ్వేదము-** పాద బద్ధములగు మంత్ర ములకు ఋక్కులనిపేరు. ఈ వేదము నందిట్టి మంత్రములే యుండుట వలన ఋగ్వేదమని పేరు గల్గెను. ఈ వేదమునకు ఇరువదియొక్క శాఖలు గలవు. ఆ యిరువదియొక శాఖలలో శాఖలశాఖ, బాష్కలశాఖ యని రెండు శాఖలు మాత్ర ము ఇప్పుడు నిలచియున్నవి. యజ్ఞ సమ యములందు హవిర్భాగములగ్రహించు నిమిత్తము హెూతయను ఋత్విక్కు ఈ వేద మంత్రములచే దేవతల నాహ్వానించును కావున నీ వేదమునకు హెూతృ వేదమనియును పేరు గలదు. ఈ ఋగ్వేదము పది మండలములుగ విభజింపఁబడి యున్నది. ఒక శాఖ వారు ఎనిమిది యష్టకములుగ విభ జించి యున్నారు. (ఏకవింశతి భేధేన ఋగ్వేదో భేదితోమునా)

**ఋతము-** సత్యము, పూజితము, వెలుఁగు, కాకి యరపు.

**ఋతంభర-** యధార్థజ్ఞానము. దూరపు వస్తువులను, కంటికిఁ గనఁబడని సూక్ష్మవస్తువులను, కనఁబడని యాత్మను తెలిసికొనుట.

**ఋతంభరాప్రజ్ఞ-** ఆధ్యాత్మ ప్రసాద ము వలనఁ గలిగెడు సత్యమగు జ్ఞానము.

**ఋషి-** గురుకులవాసానంతరము ఆశ్ర మాంతరమును పొందక, వ్రతము, తీర్థస్నానము, శీలత్వములు గల్గిన బ్రహ్మచారి. జ్ఞానాధికుఁడు, వేదము, వెలుఁగు, ముని.

**ఋషిపంచమి-**భాద్రపద శుద్ధ పంచమి నాడు సప్తర్షుల నుద్దేశించి చేయఁబడు వ్రతము.

**ఋషులు-**చక్షురాది జ్ఞానేంద్రియములు. కుహక, మాయ, శాఠ్య, అహంకార, దంబ, అనృత, వర్జితులగు సమ్యగ్ద ర్శనముఁగల పెద్దలు.

**ౠ-** ఉదకము.

**ఌ-** స్వర్గము.

**ౡ-** శుభమునుఁ గలుగఁ జేయువాఁడు. తల్లి, కన్ను, దేవత, విలాసము.

**ఏ-** ఉదకము, విష్ణువు, ఆకాశము.

**ఏకగురుఁడు-** ఒక గురుని యొద్దనే వేదాదివిద్యలనేర్చినవాఁడు.

**ఏకజీవపక్షము-** ఉన్నది యొక జీవుఁడే. ఆ జీవుఁడు భ్రాంతివలనఁ బరమేశ్వరునియందు తనయట్టివారి ననేకులఁ జూచుచున్నాఁడనువారి పక్షము.

**ఏకదండి-** జ్ఞానమను నేకదండమును దాల్చి పరమేశ్వరునియందు ధారణా బుద్ధిఁగలిగి యుండువాఁడు. (జ్ఞానదండో ధృతోయేన యేకదండి స ఉచ్యతే)

**ఏకర్షి-** అగ్ని. అథర్వవేదులయొక్క అగ్ని ఏకఋషి యనఁబడును.

**ఏకపాదము-** అకారాత్మకమగు అవిద్యా పాదము.

**ఏకమాత్ర-** లఘ్వక్షరముచ్చరించు కాలము. చిటికె వేయునంతకాలము. (ఏకమాత్రోభవేద్ధ్రస్వః)

**ఏకపాదాసనము-** కూర్చుండి ఒక పాదమును చాచి వేఱొక పాదమును మెఁతమీఁద నుంచి, రెండు చేతులను గ్రుచ్చి దానిమీఁద నుంచుట.

**ఏకరసము-** మాఱులేని తన్మాత్ర.

**ఏకస్థూణము-** బ్రహ్మదండి లేక వెన్నెముక.

**ఏకవింశన్మహాదీక్షలు-** విరాగమోక్షములగు శాంభవత్రయ దీక్షలు. వివరము:- శాంభవత్రయదీక్షలనగ శివసంబంధమగునవి. అందు క్రియాంతర్గత దీక్షలు, మనుదీక్షాంతర్గత దీక్షలు.వేదదీక్షాంతర్గత దీక్షలు. ప్రతిది యేడు దీక్షలు గలిగియున్నది. (1) క్రియాంతర్గత దీక్షలు ఏడు: ఆజ్ఞాదీక్ష, ఉపమాదీక్ష, కలాభిషేచన దీక్ష. స్వస్తికారోహణదీక్ష, భూతిపట్ట దీక్ష, అయత్తదీక్ష, స్వాయత్త దీక్షలు. (2) మనుదీక్షాంతర్గములు ఏడు:- ఏకాగ్రదీక్ష, దృఢవ్రతదీక్ష, పంచేంద్రియార్పణదీక్ష, అహింసాదీక్ష, లింగనిజదీక్ష, మనోలయదీక్ష, సద్యోముక్తి దీక్షలు. (3) వేతదీక్షాంతర్గతదీక్షలు ఏడు:- సమయదీక్ష, నిస్సంసారదీక్ష, నిర్వాణదీక్ష, తత్త్వదీక్ష, అధ్యాత్మదీక్ష, అనుగ్రహదీక్ష, సత్వశుద్ధి దీక్షలు.

**ఏకాగ్రచిత్తము-** మనస్థితి భేదములఁ జూడుము.

**ఏకాగ్రత-** ఒకే విషయమునందు నెలకొను చిత్తధర్మము.

**ఏకాగ్రము-** బాహ్య విషయములందు ప్రవర్తింపని చిత్తపరిణామ భేదము.

**ఏకాదశద్వారపురము-** శరీరము. వివరము:- శీర్షణ్యములగు నేత్ర ద్వారములు రెండు, శ్రోత్రద్వారములు రెండు, నాశికాద్వారములు రెండు, ముఖద్వారము ఒకటి. అధోద్వారములగు నాభి, గుదము. ఉపస్థ, బ్రహ్మరంధ్రము. మొత్తము పదునొకండు ద్వారములదిగాన నీపేరు శరీరమున కయ్యెను.

**ఏకాదశరుద్రులు-** (1) జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ఆత్మ యనెడు మనస్సు ఒకటి. ఈ పదునొకండుగురు శరీరమును విడచి పోవునపుడు,అశరీరమునకు సంబంధులను

కానేరవు. కనుక అగ్నినుండి పొగ యుత్పన్నమగునను ఆయుత్పత్తి నిశ్చయముకూడఁ గార్యకారణములు ప్రత్యక్షముగా నుపలభ్యమగుట ఉపలభ్యముగాకపోవుట అని వానిఁబట్టి కలిగిన పంచకమే కారణముగాఁ గలది. ఉపలంభములతో రెండును అనుపలంభములతో మూడును కలిపి పంచకమగును. 1 కార్యము ఉత్పన్నమగుటకు ముందు ఆ వస్తువు ఉపలభ్యము కాకపోవుట 2 ఉత్పత్తికిఁ బిదప ఉపలభ్యమగుట 3 కారణము ఉపలభ్యము కాఁగా కార్యము ఉపలభ్యమగుట. 4 కారణము ఉపలభ్యముకానిచో కార్యము ఉపలభ్యము కాకపోవుట 5 కార్యకారణములకు నియతమైన పూర్వాపరభావము గలిగియుండుట." అను పంచకారణిచేత ధూమాగ్నులకుఁ గార్యకారణము నిశ్చయింపఁబడుచున్నది.

ఇట్లే తాదాత్మ్య నిశ్చయముచేతఁగూడ అవినాభావము నిశ్చయింపబడును. ఇది శింశుపావృక్షము ఇది మామిడి చెట్టు అన్నచోట్ల శింశప మామిడి అన్నవి వృక్షత్వమును అతిక్రమించినచో అనఁగా అవి వృక్షములెగానిచో అవి తమ స్వరూపమునె విడుచును. అని విపక్షమందు బాధకము ప్రవృత్తమగుచున్నది గాన అవినాభావ నిశ్చయము కలుగుచున్నది. బాధకము ప్రవృత్తము కానప్పుడైతే సహభావము ఉపలబ్ధమైనపుడు కలుగు వ్యభిచార శంకను ఎవరు నివారింపఁగలరు. ఈ చెట్టు శింశప ఈ చెట్టు మామిడి అను సామానాధికరణములను బట్టి (విశేషణ విశేష్యములను బట్టి) శింశుపకు వృక్షమునకు మామిడికి వృక్షమునకు తాదాత్మ్య నిశ్చయము ఉపలబ్ధమగుచున్నది. భిన్న ప్రవృత్తి నిమిత్తములు గల శబ్దములు ఒకే యర్థమందు ఉన్నపుడు సామానాధికరణ్యము అని శాబ్దికులు. నీలఘటములో నీల శబ్దమునకు నీలగుణము ప్రవృత్తి నిమిత్తము. ఘటపదమునకు ఘటత్వము ప్రవృత్తి నిమిత్తము. ఆ నీలవర్ణమునకు ఘటత్వమునకు ఆశ్రయమైనది ఒకటే. అందు అర్థమొకటే గాన రెండింటికి అత్యంతము అభేదము లేదు. ప్రవృత్తి నిమిత్త భేదముల వలనను అత్యంత భేదము లేదు. అప్పుడు రెండును పర్యాయపదములగును. కాన ఒకసారిగా రెండు పదములును ప్రయోగించుటకు వీలుపడదు. రెంటికి పూర్తిగా భేదము ఉన్నపుడును సామానాధికరణ్యము కుదరదు. గవాశ్వము లందు అది యుపలబ్ధమగుట లేదు. కాన కార్య రూపములు కారణ రూప

టుట అగ్నిలేనపుడు పొగలేకుండుట అను నిశ్చయము వర్తమాన వస్తువిషయకమెగాని భూతవస్తు విషయకముగాదు భవిష్యద్వస్తు విషయకమునుగాదు మరియును భవిష్య దవస్తు విషయకమును గాదు. మనకు అసన్నిహితవస్తు విషయకమును గాదు. అక్కడ అటువంటి విషయములు ఒకప్పుడు అగ్ని లేకున్నచో పొగ యుండవచ్చు ననువ్యభిచార శంక దుర్వారమని దీని భావము. సరే మఱియటువంటి భూతభవిష్య దసన్నిహిత విషయమునంగూడ వ్యభిచార శంక వారింప శక్యముగానిది యందు వేని యట్లనకుము కారణము లేకుండ గార్యము పుట్టునుగాక అను శంక వ్యాఘాతము (= అసంబద్ధార్థము గల వాక్యము) వఱకే యుండును (వ్యాఘాతము అసంబంధార్థవాక్యము) పోఁగా అవి నివర్తించును. ఏది యాశింపఁగా వ్యాఘాతాదులు అవతరింపవో అదే అశంకింపఁబడును. అట్లు గూడ చెప్పఁబడెను.

> శంకాచేదనుమాస్త్యేవ న చేచ్ఛంకా తతస్తరాం
> వ్యాఘాతావధి రాశంకా తర్కాః శంకావధిర్మతః (న్యాయ. కుసు. 3-7)

"శంక ఉన్నచో అనుమానము ఉండనే యుండును. శంకలేనిచో ఇంకను ఎక్కువగా అనుమానము ఉండును."

వ్యాఘాతమువఱకే ఆశంక యుండును. తర్కమన్నది శంకయే అవధిగాఁ గలది. (న్యాయకు-37) తర్కము శంకను నివర్తింపఁజేయును. తర్కము కూడ వ్యాప్తి మూలకము. కాన దానికి ఇంకొక తర్కమును అపేక్షించినచో అనవస్థయేర్పడును. కనుక దానికి వ్యాఘాతము అసంబంధార్థము అవధియని చెప్పఁబడెను. తర్కమూలమైన వ్యాప్తిలో స్వక్రియకు వ్యాఘాతము కలుగుటచే వ్యభిచార శంక ఉదయింపనే యుదయింపదు. కాన ఇంకొక తర్కాపేక్ష లేనేలేదు. ఇంక కాలాంతర దేశాంతరములకును ఏదో యొకదానికె వ్యభిచారోపాధ్యా శంకయున్నచో అపుడు అనుమానము ఉండనే యున్నది అని భావము. ఒకవేళ అవి దేశాంతర కాలాంతరములలో తోచకపోయినచో అసలు శంకయే యుండదు. అపుడు పూర్తిగా అనుమానము ప్రమాణము ఉండనే యున్నది. శంక ఎంతవఱకంటే తర్కమువఱకే. తర్కమురాగానే ఆ శంకయే పోవును అసలు అనుమానప్రమాణము లేకుండ అవి ప్రతీతము

"ఇతరప్రమాణముల సామాన్యస్థితినిబట్టియు, అన్యబుద్ధుల గతినిబట్టియు, ఇంకొకదానిని నిషేధించుటనుబట్టియు, ప్రత్యక్ష ప్రమాణముకంటె నింకొక్క ప్రమాణము ఉన్నట్లు సిద్ధించుచున్నది" అని.

ఈయనుమాన ప్రామాణ్యము విషయములో చాలమంది పండితులు చాలచెప్పి తమపరాక్రమమును చూపిరికూడ. కనుక గ్రంథము పెరుగునను భయముచే ఆవిషయము ముగింపబడుచున్నది.

అగ్న్యాదుల యుష్ణత్వ స్వభావనములు ఒకరకమైనవి. సుఖదుఃఖాదులు ధర్మాదులు అదృష్టములు ఫలితములనుబట్టి పూర్వజన్మకారణము అని శాస్త్రాదులంబట్టి సిద్ధించును. నాస్తికులును కనిపించుపోగనుబట్టి కనిపింపని యగ్నికై పరుగెత్తువారె. వాదమునకు అనుమానము నంగీకరింపకున్నను వారు చేయు పనులలో అంగీకరించుచునే యున్నారు.

ఆ బౌద్ధులు నాలుగు విధములైన భావనలచేతఁ బరమపురుష ప్రయోజనమును చెప్పుచున్నారు. వారు 1 మాధ్యమికులు 2 యోగాచారులు 3 సౌతాంత్రికులు 4 వైభాషికులు అని నాలుగు విధములుగాఁ బ్రసిద్ధులైరి. మాధ్యమికులు సర్వము శూన్యము అని వాదించువారు. యోగాచారులు బాహ్యార్థమున్నదని అనుమానించువారు. వైభాషికులు బాహ్యార్థప్రత్యక్షవాదులు. బోధచేసినవాఁడు బుద్ధభగవానుఁడొక్కఁడే యయినను బోధింపబడిన శిష్యుల బుద్ధులభేదమును బట్టి ఆ విషయము నాలుగు విధములైనది 'సూర్యుఁడస్తమించె'ననఁగా జారులకు స్వేచ్ఛా చారత్వమును చోరులకు ధనాపహారమును, వేదానువచనము చేయువారికి సదాచార వేళయయ్యెనని యర్థమైనట్లే వారి వారి బుద్ధి విశేషములను బట్టి యాయాయర్థములు కలిగెను. బుద్ధుడు మొదట తన శిష్యులకు సర్వము శూన్యము అని యుపదేశింపఁగా, అదే పరమార్థమని యెంచి దానిపైని ఇంక ఆక్షేపముచేయని మధ్యమ బుద్ధులు మాధ్యమికులైరి.

## మాధ్యమిక మతము

నాగార్జునుఁడు మొదలగువారు మాధ్యమికులు. నాగార్జునుఁడు విదర్భ (బరారు) లో బ్రాహ్మణుని యింట పుట్టెను. ఆంధ్రరాజు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ

అగ్నివైశ్యసూత్రము, అశ్వలాయన సూత్రము, వాధూలసూత్రము, శాంబవీయసూత్రము, శౌనకీయసూత్రము, కౌండిన్యసూత్రము, కాత్యాయన సూత్రము, సత్యాషాఢ సూత్రము, కౌషీతకీసూత్రము, త్రాహియాయణ సూత్రము, హిరణ్యకేసిసూత్రము, జైమినీయసూత్రము, వైఖానస సూత్రము. భారద్వాజ సూత్రము, మాధ్యందినసూత్రము, శాండిల్య సూత్రము ఇత్యాది సూత్రములు గలవు.

**కలాధ్వములు**—నివృత్తి, విద్య, ప్రతిష్ట, శాంతి, శాంత్యతీత, శాంత్యతీతోత్తర కళలు.

**కల్పాంతప్రళయము**— బ్రహ్మదేవునకు నూరు సంవత్సరము లాయువు నిండిన పిదప పంచభూత సహితముగ మూలప్రకృతి మాత్రావశేషముగఁ గలుగు ప్రళయము.

**కవి**— భూతకాలజ్ఞుఁడు, కవీశ్వరుఁడు, శుక్రుఁడు, నీరుకాకి, జలపక్షి.

**కవ్యము**— జలపక్షుల మాంసముతో వండిన కూరలు.

**కషాయము**— రాగాది రోషమువలన బహిర్ముఖమైన సంస్కారము. మ్రాని పట్టలు, వేళ్ళు, ఓషధులు నీటవేసి మరగకాచిన నీరు. ఇట్టి కషాయమున ముంచి జేగురురంగు కలుగఁజేసిన బట్టను కాషాయమందురు. ఈ బట్టలను చతుర్థాశ్రమస్థులు ధరింతురు.

**కళ**— చిత్కళ, క్షేత్రజీవుల చైతన్యప్రకాశమే కళ యనఁబడును.

**కళాధ్వము**— నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతములనుఐదుకళలు. ఈ కళలలో మంత్ర, పద, వర్ణ, తత్త్వ భువనాధ్వములు చేరి యున్నవి.

**కా**— మాయ.

**కాకపాదము**— నాలుగు మాత్రల కాలము.

**కాకమతము**— అభ్యాసయోగము. కా, యనగ మాయ, మాయ యెవని యధీనమునన్నదో యతండు కాకుఁడు. అనగా మహేశ్వరుఁడు. అట్టి కాకుని చేర్పించు మతము కాకమతము.

**కాకాక్షిగోళన్యాయము**— కాకికిఁగల యొక కనుగ్రుడ్డే రెండుపక్కల యందుండు గోళములయందు వచ్చును. ఏ ప్రక్కకు తిరిగిన నా వైపుకు నా గ్రుడ్డే తిరిగివచ్చి చూపు నొసంగును. (ఏకైవ దృష్టిః కాకస్య, వామదక్షిణ నేత్రయోః యాత్యాయాత్యేవమానంద ద్వయేతత్త్వ విదోవిదుః)

**కాకి**— సుఖదుఃఖముల ననుభవించుచుండు జీవుఁడు వాయసము.

**కాకుఁడు**— మహేశ్వరుఁడు, కాయనఁబడు మాయను నధీనమున నుంచుకొనినవాఁడు కాకుఁడు.

**కాత్యాయిని**— నగము ముదిసి కాషాయ వస్త్రముఁ గట్టియుండెడు స్త్రీ, విధవయైన స్త్రీ, పార్వతీదేవి.

**కపాలభాతి**— కమ్మరివాని తిత్తులవలె నతివేగముతోఁగూడిన రేచక పూరకములుచేయుపద్ధతి. ఇందుచే కఫరోగములు నివర్తించునట.

ఒకటి యోగము, రెండవది ఆచారము. అందు అజ్ఞాతార్థమును తెలియుటకు ఆక్షేపము చేయుట అన్నదిట యోగము. గురూక్తమగు నర్థము నంగీకరించుట ఆచారము. కనుక ఏ శిష్యులచేత భావనాచతుష్టయమును బాహ్యార్థ శూన్యత్వమును అంగీకరింపఁబడెనో వారు యోగాచారులనంబడిరి. కాన వారు బాహ్యార్థ శూన్యవాదులనియు విజ్ఞానయ్యాత్మాస్తిత్వ వాదులనియు బిలువబడిరి. వారి యాశయము ఇది. అనాదివాసనావశమున బుద్ధియె యనేకాకారముగ భాసించును. కాన పుర్వోక్త గురూపదిష్టవాసనాచతుష్టయ పరిచయము బలమువలన సర్వవాసనలు ఉచ్ఛిన్నములుకాఁగా వివిధవిషయాకారములైనయు పద్రవములు ఉదయింపకుండుట వలన విశుద్ధమైన జ్ఞానము ఉదయించుటయె మోక్షము అని ఉపపన్నమగుచున్నది.

అన్యులైతే నీలాదిరూపమైన బాహ్యార్థము లేనపుడు దానినిగూర్చిన జ్ఞానము మాత్రము ఉన్నదని చెప్పుటకెట్లు శక్యమగును. కనుక బాహ్యార్థము కూడ ఉన్నదని యంగీకరింపవలయునందురు. బాహ్యార్థము ఉండును గాక కాని అది ప్రత్యక్షముగాదు కాని అనుమేయము అని గురువు చెప్పఁగా ఈ సూత్రపర్యంతము సరియైనదగును అని యడిగినవారు సౌత్రాంతికులనబడిరి. సూత్రాంతమును అడుగువారు సౌత్రాంతికులు. కాన వారు బాహ్యార్థానుమేయత్వవాదులనఁబడిరి

మఱికొందరు అనుభవబలమును బట్టి బాహ్యార్థములైన ఘటపటాదులను అంగీకరించినపుడు ప్రత్యక్ష బలమును బట్టి ఆ యర్థము ప్రత్యక్షమనియు నంగీకరింపఁదగును. ఇట్లు బాహ్యములును అంతరములును అయిన యర్థములు ప్రత్యక్షమైనవగుచుండ వేనిని గుఱించియో మొదట సర్వము శూన్యమని గురువు ఉపదేశించెను. పిదప కొన్నిటిని గూర్చి జ్ఞానమె సత్యము అని, కొన్నిటిని గూర్చి బాహ్యాంతరములు రెండును సత్యమె అని యభిప్రాయములో నున్నవానిని గూర్చి విజ్ఞేయము అనుమేయమును గూడ నెనెను. కాన ఇట్లు విరుద్ధముగా గురువుయొక్క భాష (వి+భాష) యని తలంచి పలుకువారు వైభాషికులనఁబడిరి. కనుక వీరు బాహ్యార్థ ప్రత్యక్షవాదులనియు సర్వాస్తివాదులనియుఁ బిలువఁబడిరి.

నాన్యోఽనుభావ్యో బుద్ధ్యాస్తి తస్యానానుభవోఽపరః
గ్రాహ్యగ్రాహకవైధుర్యాత్స్వయం సైవ ప్రకాశతే

"బుద్ధిచే అనుభవింపఁదగిన యితర ఘటాదికము లేదు. దానికింకొక యనుభవములేదు. ఇట్టి గ్రాహ్యగ్రాహకములు లేకపోవుటవలన స్వయముగా ఆ బుద్ధియె ప్రకాశించు." (వార్తికాలంకార 14 పుట) అని. గ్రాహ్యగ్రాహకములకు అభేదము అనుమానింపఁదగినది. * ఏవేదనచేత ఏదితెలియఁబడునో అది దానికంటె భేదింపదు. ఎట్లన, జ్ఞానమునకు ఆత్మ భేదింపదు. ఆవేదనలచే నీలాది పరమాణువులు తెలియఁబడును. భేదముండైతే, నియమహేతువైన తాదాత్మ్యములేకపోవుటవలనను తదుత్పత్తి నియామకము లేకపోవుటవలనను ఇపుడు ఈపదార్థముతో సంబంధము గలుగకపోవును. గ్రాహ్యగ్రాహక సంవిత్తులు (=జ్ఞేయ జ్ఞాతృజ్ఞానములు) వేఱుగా అవభాసించుచున్నవిగదా అనునది ఒకే చంద్రుడు రెండుగా భాసించుచున్నాడు అనునట్లు భ్రమమె.

అనాది అవిచ్ఛిన్న ప్రవాహముగల భేదవాసనయె నిమిత్తము. "అదికూడ ఉపలబ్ధమగునను నియమమును బట్టి నీలమునకు తద్బుద్ధికి అభేదము భ్రాంతి జ్ఞానము గలవారిచేత రెండుగాలేని చంద్రునందువలె భేదముచూడఁబడుచున్నది. విపర్యాసితదర్శనముగలవారిచేత బుద్ధిరూపమైన అవిభాగముకూడ గ్రాహ్యగ్రాహక సంవిత్తురూప భేదములుగలదివలె చూడబడుచున్నది.

సహోపలంభనియమాద భేదో నీలతద్ధియోః
భేదశ్చ భ్రాంతి విజ్ఞానైర్దృశ్యతేందా వివాద్వయే ఇతి

అవిభాగోపి బుద్ధ్యాత్మా విపర్యాసితదర్శనైః
గ్రాహ్యగ్రాహక సంవిత్తిః భేదవానివ లక్ష్యతే. అని చెప్పబడెను.

---

* వేద్యతే=తెలియఁబడును గానవేదన. పూర్వజన్మ పుణ్యపాప పరిణామ బద్ధములైన సుఖదుఃఖానుభవభావములు వేదనలు అని హరిభద్రసూరి.

సత్త్వమో అది ప్రకాశాంధకారరూప క్రమాక్రమవ్యాపకమైనది. ఏది క్రమ వ్యాప్యము కాదో అది సత్త్వముకాదు అనుచోట) వ్యాపక క్రమాక్రమముల వ్యావృత్తి కలుగఁగా (అక్కడి క్రమమునకు క్రమాక్రమము ఉండవుగాన) అక్షణికమైన దానినుండి సత్త్వవ్యావృత్తి సిద్ధమగుచున్నది. కావునను ఈ హేతువు అసిద్ధముగాదు. (ఇది సరియైన హేతువేగాని హేత్వాభాసముకాదు అనిభావము) ఈ యర్థక్రియాకారిత్వము క్రమాక్రమములచేత వ్యాప్తమైనది. అనఁగా ఏదోకొంచెము కార్యమును చేయునదియని భావము. ఈ క్రమాక్రమములకంటె ఇంకొకరూపము అనఁగా క్రమాక్రమమైన తదుభయరూపము గాని సంభవింపదు. "పరస్పర విరోధమునందైతే ప్రకారాంతరస్థితి కలుగదు. ఉక్తిమాత్రవిరోధమువలన విరుద్ధములకు ఇంకొక ప్రకారములను (అనేకత్వమును) సభవింపదు" (న్యాయకుసుమాంజలి 3-8) అనున్యాయముచే వ్యాఘాతముల కింకొకప్రకారమును సంభవింపదు. ఈ క్రమాక్రమములు క్షణికమైన వస్తువుదగ్గరనుండి వ్యావర్తమానములై అర్థక్రియను గూడ వ్యావర్తింపఁజేయుచు క్షణికత్వపక్షమందె సత్తను వ్యవస్థాపన చేయునని సిద్ధించినది. సర్వసంస్కారములు క్షణికములు. విశ్వత్రయ వివర్తములో వివర్తమానములైన ఘటపటస్తంభాంభోరుహాదులన్నియు ద్వితీయక్షణములో అదేయిదియని యుల్లేఖముచేసిన సంస్కారములు జ్ఞానసంతానములు కలుగునో అవి విచారగోచరములై క్షణికములగును క్రమయౌగపద్యములను బట్టి అర్థక్రియా విరోధము అక్షణికమై యుండుటవలన సత్తుసర్వము క్షణికము. క్షణికత్వా విశేషముగా వాదస్థలము ఊహింపనగును. విశేషోపపత్తియును సకలమైన యుత్పన్న వస్తుజాలము ముద్గరాది సామగ్రీసాకల్యముండగా వినశ్వరమని తెలియుచున్నది అవినాశస్వభావము పదార్థోత్పత్తి సమయములో ఉన్నదా లేదా. ఉన్నదన్నచో తదుత్పత్తి సమయానంతరమే వినశ్వరమగును. మఱి ఈ స్వభావమే ఏదో కొంతకాలముండి నశింపవలసియున్నది. కనుక ముద్గరాధి సన్నిధియందుఁ గూడ దానిస్వభావమదే. కాని మరలకూడ కొంతకాలమువఱకు ఉండవలసియున్నది. ఇట్లు ముద్గరాది శతపాతకాలమందుఁగూడ వినాశములేదన్నచో ఘటము కల్పాంతముదాక ఉండవలసివచ్చును. అప్పుడు జగద్వ్యవహారవ్యవస్థ లోపించును. కాన ఇష్టము లేకున్నను పదార్థములు క్షణస్థాయికములు అని యంగీకరింపవలెను. దాని ప్రయోగ మిట్లు — వినశ్వర స్వభావముకలవి. కాన

హరిణస్తామ్రవర్ణస్యాత్। ఏణఃకృష్ణ ప్రకీర్తితః। కురంగ ఈషత్తామ్రస్యాత్ ఏణతుల్యా కృతిర్మహాన్। ఋశ్యోనీ లాంగకోలోకే। నరోజ్జఇతికీర్తితః। పృష తశ్చంద్రబింబస్యాద్ధరిణాకించిదల్పకః। న్యంకుర్బహువిషాణోఽథ శబరో గ వయోమహాన్। రాజీవస్తుమృగోజ్ఞేయో రాజిభిః పరితోవృతః।యోమృగశ్శృంగ హీనస్యాత్సముంతీతి నిగద్యతే॥ (అర్క ప్రకాశము 7 శతకము)

(1) హరిణము : తామ్ర వర్ణముగల్గి యుండు జింక. (2) ఏణము : కృష్ణ వర్ణము అనగా నల్లని వర్ణము గల జింక. (3) కురంగము : కొద్దిగతామ్ర వర్ణముగల్గి ఏణము పోలికతో గొప్ప ఆకృతిగల జింక. (4) ఋష్యము : నల్లని రూపముగల్గి నరోజ్జమని ప్రసిద్ధంబైయుండు జింక. (5) పృష తము : తెల్లని మచ్చలుగల్గి హరిణము నకన్న కొంచెము చిన్నదిగ నుండు జింక. (6) న్యంకువు : పలువ కొమ్ము లు గలిగిన జింక. (7) రాజీవము : చారలుగల జింక. (8) ముండి : కొమ్ములులేని జింక.

**కేదారము-** భ్రూమధ్య స్థానము, నంజ నేల,

**కేవలకుంభకము-** రేచక పూరకముల విడిచి ముఖ్యముగ వాయునిరోధ మొనర్చునట్టి ప్రాణాయామము.

**కేవలీభావము-** దృశ్య రహితమగు నాత్మస్థితి.

**క్లేశపంచకము-** అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినవ, క్లేశములు.

**కైవర్తులు-** వైష్ణవ మతమును స్వీక రించిన వడ్డెరలు. పడవల నడుపు వారు.

**కైవల్యనాడి-** సుషుమ్నానాడికి లోపల నుండునాడి. ఈ నాడిలోనికి ప్రాణ వాయువును జొనిపినయోగి బ్రహ్మ కల్ప పర్యంతము స్థూల శరీరమును శిథిలముఁ గానీయక నుంచుకొనఁ గలఁడు. (మత్తత్వ వేత్తుః కరణాళి రాదౌ। కైవల్యనాడ్యంతర చిత్తమేత్య। అబ్రహ్మ కల్పం విలయం భజన్ సన్। కాయేన కైవల్య మహప్యతిష్ఠేత్)

**కోపాగ్ని-** నేత్రములయందున్నయగ్ని. పంచాగ్నులలో నొకటి.

**కోశములు-** ఈ స్థూలదేహమైనది జడ ములై యుండు సుషుప్తి, మూర్ఛ. మరణకాలములయందు వేఱుపడి యున్నది. ఇట్టి క్షణభంగురమైన శరీ రమును నేనని యభిమానించుటం బట్టి, కత్తికి ఒరవలె కప్పియుండుట చేత కోశమనఁబడు చున్నది. (కోశ మనగా ఒర).

**కోష్ఠాగ్ని-** గార్హపత్యాకృతి గలిగి నాభి యందుండి చతుర్విధాన్నముల జీర్ణిం పఁ జేయునగ్ని.

**కౌమం-** నారచీర.

**కౌలులు-** ముక్తులు లేక పరమహంసలు. శాక్తేయులు,సిద్ధులను కౌలులందురు. వారినే వేదాంతులు పరమహంస లందురు. బౌలసంప్రదాయక వైష్ణ వులు సాయులు అని యందురు.

**కమ్-** సుఖము, శిరస్సు, ఉదకము.

అర్థక్రియాకారి యగును. ఏది ఎప్పుడు దేనిని జేయలేదో అది ఇప్పుడు అందు చేయలేనిదై అసమర్థమగును. ఎట్లన జాతిముక్క అంకురమగుటలో సమర్థము కాదు. అది యెప్పుడును మొలవనే మొలవదు. ఇది వర్తమానకాలికార్థ క్రియాకరణకాలమందు జరిగిన జరుగఁబోవు నర్థక్రియలను జేయునని యనరాదు. అట్లనుచో అది భూతభావులలోఁగూడ తత్తత్కాలిక ఘటోత్పాదక క్రియాకరణ రూపప్రస్తుత ప్రసంగమునకు విపర్యాసమగును. మఱి క్రమము వలె సహకారియును లభించుటవలన స్థాయికి అతీతానాగతములందు క్రమముగా చేయుట ఉపపన్నమగునన్నచో అందు దీనిని నీవు అడిగి వ్యాఖ్యానము చేయుదును గాక. కార్యక్రమము సహకారినిబట్టి యుండును గాని వాని సామర్థ్యాసామర్థ్యములను బట్టి కాదు. కనుక వస్తువునకు స్థాయిత్వము ఉపపన్నమగును.

సహకారులు పదార్థమునకు ఉపకరించునా? ఉపకరింపవా? ఉపకరింపక పోయినచో అది యుపేక్షింపఁదగినది కాదు. ఏమియైనఁ జేయుచున్నదే యవి దానికై ఉపయోగింపవు గదా. మఱి భావమునకు ఆ సహకారులతో గూడ నేదో కార్యమును జేయుటయే స్వభావము అన్నచో జాయి అదేయైనచో అది సహకారులను విడువదు. పైగా పారిపోవునాసని గూడ అందు సాధము పై చిక్కట్టి చేయఁదగిన కార్యమును జేయును స్వభావము విడువరానిదగుటన అది అట్లు చేసియె తీరును. ఇంక సహకారులు ఉపకరించునన్న పక్షమున ఆయా యుపకారభావమును భేదించునా? భేదింపదా? భేదించునను పక్షమున ఆగంతుకమైన యతిశయముచే అన్వయ వ్యతిరేకములను అనుసరించి కార్య విధాయి అగుటవలన ఆగంతుక భావమె కారణమగును గాని అక్షణికమైన భావము కారణము కాదు. అది యిట్లు చెప్పఁబడెను.

వర్షాతపాభ్యాం కిం వ్యోమ్నశ్చర్మణ్యస్తి తయోః ఫలం
చర్మోపమశ్చేత్సోఽనిత్యః ఖతుల్యశ్చేదసత్ఫలః

“ఆకాశము ఎండదు తడవదు కాన వర్షాతపములచేత ఆకాశమునకు బాధ ఏమియు గలుగదు” చర్మమునకు మాత్రము బాధయున్నది. ఏలనన ఇది

ఈ యైదు గతులలో కుండలినీ సహ
స్రారముజేరినచో సమాధి సిద్ధించును.

**కుంభకము**— ఉచ్ఛ్వాస నిశ్శ్వాస నిరో
ధము రేచించినమీదట గాలిని లోనికి
దీయక నిలుపుట భాహ్య కుంభకము
పూరించినమీదట గాలిని వెలుపలికి
వదలక నిలుపుట అంతః కుంభకము.

**కుః**— భూమి, పాపము, నింద.

**క్రతువు**— యూపస్తంభ సహిత
యజ్ఞము. అవశ్యము జేయుదుసని
నిశ్చయించుట.

**క్రమముక్తి**— వైరాగ్యోపశాంతులు
గలిగి, అర్చురాది మార్గము ద్వారా
సూర్య, బ్రహ్మ, ఉపాసనా మూర్తుల
లోకములంజేరి, యందెచటనైనను
బ్రహ్మవిచారణఁజేసి కడపటముక్తిఁ
బొందుట.

**ఖగాసనము**— కపాలాసనము.

**ఖేచర్యాసనము**— బీజముల క్రింది నర
ములయందు ఎడమకాలి మడమ
నుంచి, మోచేతిని మోకాలియందు
అంగుళిని వెడల్పు జేసి యుంచి,
నాసికాగ్రమును వీక్షించుచుండుట.

**ఖేచరీబీజము**— హ్రీం, కారము.

**ఖేచరీమంత్రము**—హ్రీం భం సం మం
పం సం క్షం అను బీజాక్షరములు.

**ఖేచరీముద్ర**— లంబికా యోగము.
లంబిక యనఁగ చిఱునాలుక. నాలు
కకు క్రిందిభాగముననున్న నరమును
అంటియున్న మాంసమును బంగారు
శలాకతోఁ గొద్దికొద్దిగ ఛేదించి, నిడివిగ
నాలుకను సాగదీసి, పిమ్మట నాలు
కను కపాలకుహరమున చొప్పించి,
భ్రూమధ్యమున దృష్టినుంచు ముద్ర.
ఇది మిక్కిలి అపాయకరమైనది.
అనుభవజ్ఞులగు గురుల ఆజ్ఞాను
సారము అభ్యసింపవలెను. ఈ విష
యము యోగకుండల, శాండిల్య ఉప
నిషత్తులలో వివరముగ తెలుపఁబడి
యున్నది. పంచ ముద్రలలో నొకటి
యగు భ్రూమధ్యమున చూపు నిలిపి
చూచుముద్ర.

**ఖం**— ఇంద్రియము, సుఖము, ఆకా
శము, నక్షత్రము, దయ, పలకము,
బిందు, శూన్యము, సంవేశము,
రంధ్రము.

**ఖః**— శాంతరసము.

**గజకరణి**— యోగులు అపానవాయువు
ను కంఠనాళమునకు లేపి, భుజించిన
యన్నమును, త్రాగిన నీరును,
వాంతిఁజేయుపద్ధతి. వాంతి యనగా
డోకు.

**గతాయాత**— చిత్తభేదములఁజూడుము.

**గమనము**— పోవుట.

**గరిమసిద్ధి**— తన శరీరమునైనను, లేక
తలచిన వస్తువులనైనను, వలసినంత
బరువుగా నుండునట్లు చేసికొనఁగల
తపఃసిద్ధి.

**గర్భదాసులు**— పూర్వకాలమునఁ గొం
దఱు బిడ్డలను పుట్టగానే, వారి తలి
దండ్రుల నుండి కొని పెంచి,బానిసల
గా నుపయోగించుకొనువారఁట. అట్టి
వారే గర్భదాసులు.

**గర్భాసనము**— ఉత్థాన కూర్మాసనస్థుఁ

కలుగును. కనుక మూఁడవ యనవస్థ దురవస్థమగును. మఱి భావముకంటె అభిన్నమైన యతిశయము సహకారులచేత జన్యమానమగునని యంగీకరించిన చో అపుడు ప్రాచీనమైన యతిశయ రూపభావము నివృత్తమై యింకొక యతిశయ రూపమైన కుర్వద్రూపాదిపదవేద నీయమైకార్యాకార్యాదిపటములచే దెలియఁదగినది పుట్టును. కావున నామనోరథ రూపతరువుకూడ ఫలించినట్లయినది. కనుక క్రమమును బట్టి అక్షణికమునకు అర్థక్రియ దుర్ఘటమగును.

వికల్పములను (మార్పులను) సహింపదు గాన అక్రమమును బట్టి కూడ అది ఘటింపదు. ఎట్లనగా ఒక్కమాటగా సకల కార్యములను చేయుటలో సమర్థమైన స్వభావము దాని తరువాతగూడ కార్యములు చేయుటలో సమర్థమగునా కాదా? సమర్థమగునన్నచో అది ప్రస్తుతకాలమునందు చేయగలుగును. తరువాతి కాలము గోచేను కాలదన్నచో స్థాయియగునను నాశమూషిక భక్షితమై డొలకయగు బీజాదులందు అంకురాది జనన ప్రార్థన వ్యర్థమైనట్లు బీజాలుస్థాయుయగునను ఆశ వ్యర్థమగును. నికిపే బీజాభావము ప్రతిక్షణము భిన్నము విరుద్ధధర్మ విశిష్టమగుట వల్ల అని ప్రయోగములు చెప్పుకొనవచ్చును ఏదివిరుద్ధ ధర్మాధ్యాసము (అధ్యాసము=అనుభావ్య జ్ఞానము) గలదో. అది నానావిధములైనది. ఎట్లనఁగా శీతోష్ణములు ఇదివిరుద్ధ ధర్మాధ్యాసముగలది అన్నచోజలధరమందు ప్రతిబంధము సిద్ధించును. మఱి ప్రతిక్షణము నవనవ రూపము ననుభవించును కనుక అట విరుద్ధ ధర్మాధ్యాసమును నానాత్వముల వ్యాప్తి సిద్ధించును. స్థాయియందు కాలభేదముచేత సామర్థ్యా సామర్థ్యములకు ప్రసంగము అప్రసంగమును సిద్ధించుటవలన ఇది అసిద్ధమైన హేతువుగాదు. బీజాది పక్షమందు కాలభేదముచేఁగూడ విరుద్ధ ధర్మాధ సత్వ హేతువు కనిపించక పోవుటవలన విరుద్ధ ధర్మాధ్య స్తత్వ హేతువు స్వరూపాసిద్ధము ఇట శబ్దము గుణము చాక్షుషమగుటవల్ల అనునట్లు కలుగునని శంకించుటలోని యాశయము. అందు అసామర్థ్యము సాధించునట్టి ప్రసంగాప్రసంగము ఇదివరకు చెప్పఁబడెను సామర్థ్య సాధకములిప్పుడు చెప్పఁబడుచున్నవి. ఏది యెప్పుడు దేనిని పుట్టించుటకు అసమర్థమో అది అపుడు దానిని పుట్టింపదు. ఎట్లనఁగా జాతిముక్కి అంకుర్ధమును గల్గుగచేయదు వర్తమానార్థ క్రియాకరణ కాలమందు అతీతా

నాగత కాలమందలి యర్థక్రియలను చేయుటలో ఇది యసమర్థమైనదని ప్రసక్తమగును. ఏది యెప్పుడు దేనిని చేయునో అది అప్పుడు దానిని చేయుటలో సమర్థమగును. ఎట్లనగా సామగ్రి స్వకార్యమును చేయుటలో సమర్థమగును. అతీతానాగతకాలమందు తత్కాలవర్తులగు నర్థక్రియలను ఈ భావము చేయునను ప్రసంగమునకు వ్యత్యయమె విపర్యయము వ్యతిరేక వ్యాప్తి ముఖమున ప్రదర్శింపఁబడిన యనుమానము ప్రసంగానుకూల మనబడును. అన్వయ వ్యాప్తిముఖమున ప్రదర్శింపఁబడిన యనుమానము ప్రసంగ విపర్యయానుమాన మనబడును. లేనిమున్నదని యాపాదించుట ప్రసంగము. ఉదా:- పర్వతము నిప్పుగలది పొగబట్టి అనుచోట ఎక్కడ అగ్న్యభావము అక్కడ ధూమాభావముఁగలదు. ఎట్లన హ్రదము అన్నది వ్యతిరేకవ్యాప్తి. దీనిచే పర్వతమందు లేనిధూమాభావము ఉన్నదని ఆపాదింపఁబడుచున్నది. ఎట్లనగా హ్రదమందువలె పర్వతమందు నిప్పులేనిచో ధూమమును ఉండదు. అని అధూమాభావమును ఆపాదించుటతోఁగూడిన పర్వతధూమదర్శనముచేత నిప్పు అనుమానింపఁబడుచున్నది. ఇది ప్రసంగానుమానము. ప్రకృతమునందైతే స్థాయియైన వర్తమానార్థ క్రియాకరణ కాలమందు అతీతానాగత క్రియాకరణాసామర్థ్యము సాధ్యము అవియును అతీతానాగత క్రియను అప్పుడు చేయుకపోవుటద్వారా సాధింపఁబడుచున్నది. అందును ఏది సమర్థమైనదో అదిచేయుచునే యుండును. ఇటువ్యతిరేక వ్యాప్తిచే వర్తమాన క్రియాకరణమందు అతీతానాగత క్రియనుకరణము ఆపాదింపబడుచున్నది. అట్టి ఆపాదనతోఁ గూడిన వర్తమానకాలాతీతానాగత క్రియను అకరణదర్శనము చేత అసామర్థ్యము సాధింపబడినది. ఇట్లు అసామర్థ్యసాధకమైన ప్రసంగము ఇదివరలో చెప్పఁబడినది. ఉన్నది ఉన్నట్లు ప్రదర్శించుట ప్రసంగవిపర్యయమగును. ఎట్లన, ఎక్కడ ధూమమున్నదో అక్కడ నిప్పుగలదు అనియన్వయవ్యాప్తిని ప్రదర్శించి పర్వతమందు ఉన్న ధూమమును ప్రదర్శించుట దానిచే అక్కడనిప్పు అనుమానింపబడుచున్నది. ఇదియును అసామర్థ్యమును సాధించునది. ఏదిఎప్పుడు చేయులేదో అదిఅప్పుడు అక్కడ అసమర్థము అని యావిధముగా ఇదివరలో చెప్పబడినది. సామర్థ్య సాధకమునలైన ప్రసంగ, ప్రసంగ విపర్యయములును గూడ ఇట్లే తెలిసికొనదగినవి. అందు ఇది సారము. క్రియాకరణ సామర్థ్యములు సమనియతములగుట వలన అవి

పరస్పరము వ్యాప్య వ్యాపకములగుటవలన వ్యాప్తిద్వయము సంభవించును. ఏదిచేయునో అది సమర్థమైనదన్నది ఒకటి. ఏది అసమర్థమో అదిచేయదు అన్నదింకొకటి. ఈనాలుగు వ్యాప్తులందు మొదటిది. సాధ్యసాధకమైన అన్వయవ్యాప్తి రెండవదైతే అసామర్థ్య సాధకమగు వ్యతిరేకవ్యాప్తి. మూడవది అసామర్థ్యసాధకమైనది యన్వయవ్యాప్తి నాల్గవదియైతే సామర్థ్యసాధకమై, వ్యతిరేకవ్యాప్తి. విపర్యయనంగా పక్షమందు క్రమయౌగ పద్యవ్యావృత్తి చేత వ్యాపకము అనుపలబ్ధ మగుటవల వ్యతిరేకవ్యాప్తిని పొంది ట్టియు ప్రసంగ, తద్విపర్యయబలమువలన అన్వయవ్యాప్తిని గ్రహించనట్టియును నగు సత్త్వము. అది క్షణికత్వపక్ష యందె వ్యవస్థచేయఁబడునని, సిద్ధించినది. సాధ్యమైన క్షణికత్వమందు అక్షణికములుగా ఇతరులంగీకరించిన ఈశ్వరకులాలాదులు విపక్షము. కార్యకారిగా క్రమము అక్రమమును సంభవింపవుకనుక అర్థ క్రియాకారిత్వ వ్యాపకమైన క్రమా క్రమాన్యతరత్వము ఈశ్వరాదులందు లేకపోవుటవలన వ్యాపకమైన యర్థక్రియాకారిత్వమును ఉండదు అట్లుజ్ఞానశ్రీ చెప్పెను.

యత్సత్తత్క్షణికం యథాజలధరః సంతశ్చభావాఅమీ
సత్తాశక్తిరిహార్థకర్మణిమితేః సిద్ధేషు సిద్ధా న సా
నాప్యేకైవ విధాన్యథా పరకృతేనాపి క్రియాదిర్భవేత్
ద్వేధాపిక్షణభంగ సంగతిరతః సాధ్యేచవిశ్రామ్యతి

సత్తగలది సత్తు. ఏది సత్తో అక్షణికము. ఎట్లన జలధరము ఈ భావములు సత్తులు. ఈ యర్థక్రియ యందుగల శక్తి సత్త. మితిని ట్టి ప్రమాణమును బట్టి అది సిద్ధమైన యక్షణికములందు సిద్ధమైయున్నది. అక్షణికము కాదు. దేనిచేనేది పుట్టదో దేనివల్ల జ్ఞానముకూడ పుట్టదో అట్టి వస్తువు లేనేలేదు. రాతి మధ్యనున్న దీపసహస్రమువలె దానియస్తిత్వములో ప్రమాణములేదు. కనుకనే వైశేషికులు అపేక్షాబుద్ధికి ముందుద్విత్వమును అంగీకరింపరు. స్వయముగా ఆసత్త క్షణికమే ఇదియొక విధమైనది కాదు కూడ. అట్లుకానిచో పరకృతమగు సహకారిచేతఁ గూడ క్రియాదులు అగును. రెండు విధములఁ గూడ నానాత్వముచేత స్థిరత్వమందును ఏకవిధత్వముచేత

అసిద్ధమందును ఈ క్షణభంగ సంగతియగును. కనుం
విశ్రమంచును" అని.

కణాద గౌతమాది పక్షమును ద్వారముగాఁజేసికొని సత్తాసామాన్య సంబంధము కలిగియుండుటయె సత్త్వము అని తలపరాదు. అట్లు తలచినచో సామాన్యవిశేష సమవాయములును అసత్త్వములు కావలసివచ్చును. అక్కడ స్వరూప సత్తనుబట్టి సద్వ్యవహారము కలుగుట లేదు. అట్లైనచో ప్రయోజక గౌరవము అన్నమగును. అపుడు అనుగతానను గతత్వరూప వికల్పములు పరాహతమగును కూడ అపగింజ పర్వతము మొదలైన విలక్షణమైన పదార్థములందు అనుగతముగానున్న యాకారము మణులందు దారమువలె భూత గుణములందు గుణములువలెను ప్రతిభాసింపకపోవుటవల్లను గూడ స్వరూప సత్తనుబట్టి సద్వ్యవహారము గలుగను.

మఱి సామాన్యము సర్వగతమా? లేక స్వాశ్రయ సర్వగతమా? సర్వగతమన్నచో సర్వ వస్తువులకు సాంకర్యము ప్రసక్తనగును. అది అపసిద్ధాంతము కావలసివచ్చును గూడ. కనుక ప్రశస్త పాదాచార్యులు స్వవిషయము సర్వగతము అనిరి. మఱియు ఉన్న ఘటమందు వర్తమానమైన సామాన్యము ఇంకొకచోటఁ దయారగుచున్న ఘటముతో సంబంధించినదై యుండునా? దానినుండి వచ్చుచు సంబంధించి యుండునా? లేక దానినుండి రాకుండనె సంబంధించి యుండునా? మొదటి పక్షములో అది అనిత్యము కావలసివచ్చును. రెండవ పక్షములో సంబంధము అనుపపన్నమగును. మఱియు నశించిపోయిన ఘటమందు సామాన్యము ఉండునా లేక ఘటము నశింపఁగా ఆ సామాన్యము ఇంకొకచోటికి పోవునా? మొదటి పక్షమున అది నిరాధారము కావలసివచ్చును. రెండవపక్షమున నిత్యత్వ వాక్యయుక్తి అయుక్తమగును. మూఁడవపక్షమున ద్రవ్యము కావలసివచ్చును. ఇత్యాది దూషణగ్రహములచే గ్రస్తమగుటచేత సామాన్యముల అప్రామాణికము. అది ఇట్లు చెప్పఁబడెను.

అన్యత్ర వర్తమానస్యతతోన్య స్థానజన్మని
తస్మాదచలతః స్థానాద్వృత్తిరిత్యతియుక్తతా ।

యత్రాసౌవర్తతే భావస్తేన సంబధ్యతే నతు
తద్దేశినంచవ్యాప్నోతి కిమప్యేతన్మహాద్భుతం
నయాతినచతత్రాసీ దస్తిపశ్చాన్న చాంశవత్
జహాతిపూర్వం నాధారమహోవ్యసన సంగ్రహః

మఱియొక్కచోట (ఒకఘటమందు) ఉన్నదానికి (ఘటత్వమునకు) దానికంటె (ఘటముకంటె) నింకొకస్థానమునకు (ఘటాంతరమునకు) ఉన్న కలుగుచుండఁగా కదలని యాస్థానమునుండి యుండుట యున్నదే ఏమి అత్యంతయుక్తత్వము (ఆయుక్తికమా లేక సయుక్తికమా అనిపరిహాసము ఎక్కడ ఈఘటరూప భావమున్నదో దానిలోనైతే భూతలముతో ఘటత్వము సంబంధముకాదు. ఆదేశమునగల ఘటము ఘటత్వమును వ్యాపించును. ఇది ఏదో మహాద్భుతము వెళ్ళదు ఘటత్వజాతిక్కడ లేదు. తరువాతఅంశవలె నున్నదా కాదు పూర్వస్థితి విడుచును. ఆధారములేమి ఇది దోషపరంపర ఏమి అని ఘటమగుటకుముందు మట్టిముద్దయందు ఘటత్వము లేదు. ఘట మైనతరువాతనే ఘటమందు ఘటత్వమున్నది. ఇది యుక్తమైనదికాదు సావ యువమునకు వృద్ధియున్నది. ఘటత్వమున్నది నిరవయవము.

సర్వఘటమునందు ఏఘటేతరభేదమున్నదో అదిదానిమూలకమైనదే ఇది ఘటము ఇది ఘటము అనువృత్తమైనది ఘటము. అనుప్రత్యయము ఏమి ఆదారముగలది అన్నచో ఓయి ఇతరమైన యపోహమె (వ్యావృత్తి భేదము) ఆధారముగాఁగలది అని యాయుష్మంతుఁడు నీవు సంతోషింపవలెను. కాన ఇంక అతిప్రసంగముచాలును అని యాక్షేపము.

సర్వసంసారము దుఃఖాత్మకమైనదని సర్వశాస్త్రకారులందురు. అట్లు గానిచో ఆదుఃఖమునుండి మరలుటకెందుకు ప్రయత్నింతురు. కనుక సర్వము దుఃఖము దుఃఖము అని భావింపవలెను. సరే మఱి అదుఃఖము దేనివలె నుండును. అని యడుగఁగా దృష్టాంతము చెప్పవలయునన్నచో అట్లన రాదు. సర్వలక్షణమె (అవిషయములన్ని నాసన్నిధానము వలనఁగలుగు జ్ఞానప్రతిభాసభేదెమే) గలలక్షణములు పదార్థములు క్షణికములుగాన సమాన

లక్షణము లేకపోవుటవలన దీనితో సమానమైననది ఇంకొకటున్నదని చెప్పుట
శక్యముగాదు కనుక స్వలక్షణము స్వలక్షణముఅని (స్వ అసాధారణముగా
లక్షింపఁబడునది) సామాన్యలక్షణములేనిది క్షణికము" అని భావింపవలెను.
ఇట్లు శూన్యము శూన్యము అని భావింపవలెను. స్వప్నమందు జాగరణయం
దును. ఈరజతాదికము నాచే చూడఁబడుటలేదు. అనువిశిష్టనిషేధము
ఇచటదర్శనముక్రియ, ద్రష్టకర్త, తత్కార్మాదికము దృశ్యము ఇదినిషిద్ధము)
ఉపలబ్ధమగుటచేత ఇట్లు శూన్యము శూన్యము అని భావింపవలెను. శుక్తిని
జూచి రజతమనుకొని ప్రవర్తించి అక్కడకు వెళ్ళి రజతమును చూడక స్వప్న
ములోగాని మెలుకువలోగాని ఈరజతమును నేనుచూడలేదు అను నిషేధమును
అనుసరించును కారకమందన్వయించిన క్రియయందును నఞర్థము నిషేధా
ర్థము అన్వయించుటచేత కారకాదులందన్వయించిన క్రియకై నిషేధమునుచే
బోధింపఁబడుచున్నదని దర్శనక్రియకర్త తత్కర్మాధిక దృశ్యము నిషేధింప
బడుచున్నది. ధర్మిధర్మము వానిసంబంధము మూడు సామాన్యముగ నిషిద్ధ
ములగుచున్నవి. కనుక ధర్మియైన శుక్తికి దాని ధర్మమునకు ఇది అను
దానికి రజతత్వమునకు నిషేధమువల్ల రజతత్వమునకు వలె శుక్త్యాదులకును
అసత్యత్వమే యగునని శూన్యవాదమందు పర్యవసానమగును. ఇటనైయాయి
కులిట్లుఅందురు. విశిష్టక్రియయందు నఞర్థము నిషేధార్థము అన్వయించి
నను అన్నిచోట్ల అన్ని నిషేధింపబడవు. చీకటిలో నేను ఘటమును చూచుట
లేదు అనుచోట దర్శనక్రియకేగాని ద్రష్టకుగాని ఘటమునకుగాని నికటినిగాని
నిషేధములేదు. కాళ్ళతో నడిచివెళ్ళుచున్నాడన్నపుడు రథముపై వెళ్ళుట
లేదు అన్నచోట ప్రధానమైనను గమనక్రియకు నిషేధములేదు, రథమునకే
నిషేధము అనిఅందురు. సత్తుదృష్టమైనచో అపుడు తద్విశిష్ట దర్శనమును
ఇది యను భావమును. అధిష్ఠానమును దానియందు అధ్యవసింపఁబడిన
రజతాదులును తత్సమవాయాది సంబంధమును సత్త్వములు కావలసివచ్చును.
ఇట్లై అన్నిచెప్పఁబడెను మఱి ఇది ఏవారికిని ఇష్టముకాదు. అర్ధజరతీయముఁ(
సగము ముసలిది (సగము పడుచుది = అవయవ పటుత్వములేకపోవుటచే
యువతికాదు. నల్లనిజుట్టునుబట్టి ముసలిదియుఁగాదు (ఇదియుగాదు అను
న్యాయమును ఉచితముకాదు కోడిపెట్టలోని యొకభాగము వంటకును,

ఇంకొకభాగము ప్రసవమునకును గల్పింబడుగాక అనునట్లు ఇటను గల్పింపబడదు. కావున అధ్యవసింపఁబడిన అధిష్ఠానతత్సంబంధ దర్శనద్రష్టలలో ఒకటిగాని అనేకముగాని లేనపుడు నిషేదవిషయముగా సర్వమునకు అసత్త్వము బలాత్కారముగా ఆపన్నమగుననీ భగవానుఁడు ఉపదేశింపఁగా, ఉత్తను ప్రజ్ఞులైన మాధ్యమికులైతే ఇట్లు చెప్పిరి.

* భిక్షుపాద ప్రసారణ న్యాయముచేత క్షణభంగాద్యభిహిన ముఖముగా. స్థాయిత్వానుకూల వేదనీయత్వాను గతత్వ సర్వసత్యత్వముల క్రమము వారించుటచేత సర్వము శూన్యము అను దానియందె పర్యవసించును. కనుకతత్త్వము సత్తు అసత్తుసదసత్తులు ఉభయముకావు అని యిట్లు శూన్యము శూన్యముఅని భావింపఁబడెను.

ఎట్లనఁగా ఘటాదులకు సత్త్వము స్వభావమైనచో అపుడు ఘటాదికారక వ్యాపారము వ్యర్థము. ఇంక అసత్త్వమె స్వరూపస్వభావము అనుపక్షము నో ఇదివఱకటి దోషమెపట్టును. అట్లును చెప్పబడెను.

న సతః కారణపేక్షా వ్యోమాదేరివ యుజ్యతే
కార్యస్యాసంభవీ హేతుః ఖపుష్పాదేరివాసతః

ఆకాశాదులకువలె సత్తునకు కారణాపేక్ష యుక్తముకాదు. లేనియాకాశ పుష్పాదులకువలె కార్యమునకు హేతువు అసంభవమైనది" అని.

విరోధముండుటవలన ఇతరపక్షములు అనుపపన్నములు అవి భగవానునిచే లంకావతారమందు చెప్పఁబడెను.

---

* భిక్షువు వస్త్రభిక్షార్థమై యొకనియింటికి పోయి అక్కడ అన్నము దొరకపనితలఁచి మొదటధనికునియింటిలో అడుగుచాపి( = పాదప్రసారణ) పరిచయము పొందిన పిదప సర్వము ఇటసంపాదింతునని మొదట స్వల్ప భిక్షనడిగి పిదపవస్త్రము పిదపమిగిలినవన్నియు అడిగిపొందుట భిక్షుపాద ప్రసారణ న్యాయము.

బుద్ధ్యావివిచ్యమానానాం స్వభావోనావధార్యతే
అతోనిరభిలప్యాస్తే నిస్స్వభావాశ్చ దర్శితాః
ఇదంవస్తుబలాయాతం యద్వదంతి విపశ్చితః
యథా యథార్థాశ్చింత్యంతే విశీర్యంతేతధాతథా ఇతి

"బుద్ధిచేత వివేచనచేయుబడుచున్న పదార్థముల స్వభావము నిర్ధారణచేయబడదు. కనుక నిర్వచింపలేని పదార్థములు నిస్స్వభావములుగా జూపంబడెను. ఇది వస్తుబలముచే వచ్చినదని ఎట్లు పండితులు చెప్పుచున్నారో అటు అట్లువిశీర్ణములగుచున్నవి.

ఏపక్షమందును స్థిరముగానుండదని భావము. దృష్టార్థముల వ్యవహారమైతే స్వప్నవ్యవహారమువలె సంవరణముచే (అవిద్యచే అనగా కల్పనచే) జరిపడుచున్నది. కనుకనే ఇట్లు చెప్పంబడెను.

పరివ్రాట్ కాముకశునామేకస్యాం ప్రమదాతనౌ
కుణపః కామినీ భక్ష్యఇతి తిస్రోవికల్పనా

"ఒకస్త్రీ శరీరమె పరివ్రాట్టులచే పీనుగుగాను, కాములచేఁ గామినిగను. కుక్కలచే భక్ష్యముగాను, ఇట్లు మూడువిధములైన కల్పనములు చేయఁబడుచున్నవి" అని.

అథాప్యేకైనసాభాలా బుద్ధితత్త్వం తథైవనః
తదన్యద్వత్తు జాత్యాదితన్నిరా క్రియతాంత్వయా

ఒకస్త్రీయే అనేకవిధముగా దోచినట్లు ఒకబుద్ధి తత్త్వమె అట్లుఅనేక విధములుగా తోచుచున్నది. ఏది యన్యమైనది కలదో కూడ ఆజాత్యాదులను నిరాకరింపవలెను.

క్షణికాబుద్ధిరేవాత త్రిధాభ్రాంతైర్వికల్పితా
స్వయంప్రకాశ తత్త్వజ్ఞై ర్ముముక్షిభిరుపాస్యతే

స్వయముగా ప్రకాశించు తత్త్వమును దెలిసిన ముముక్షువులచే క్షణికబుద్ధియె ఉపాసనంపబడుచున్నది అధిక్షణికముగానే అది త్రివిధముగా భ్రాంతులచే వికల్పింపబడెను

ఇట్లు భావనాచతుష్టయము వలన సకల భావనలు నివర్తింపఁగా పర నిర్వాణము శూన్యముగా సిద్ధింపగలదు. కనుక మేము కృతార్థులము. మేమింక ఉపదేశింపవలసినదేదియులేదు. యోగము ఆచారము అనురెంటిని శిష్యులు అనుసరింపవలెను అందు ప్రాప్తమైనదానిని పొందుటకు పర్యను యోగము (దూషణకై జిజ్ఞాస) యోగము। గురువు చెప్పినదానిని అంగీక రించి ఆచరించుట ఆచారము. గురువుచెప్పినదానిని అంగీకరించుటచే ఉత్తములును। దూషణకై జిజ్ఞాసను చేయకపోవుటచే అధములును అగుదురు. కనుక వారికి మాధ్యమికులని ప్రసిద్ధికలిగెను.

బుద్ధియనఁగా-జ్ఞానమె అంతఃకరణము మాత్రముకాదు. తెలియును అన్నను ఎఱుఁగును ఉన్నను ఒకటె. బౌద్ధులలో మూఁడుమతములవారు బుద్ధిని అంగీకరికతురు. బాహ్యార్థమున్నదని యిద్దఱు. ఇతరవిషయిములలో వారిలో మతభేదములు గలవు. బాహ్యార్థము ప్రత్యక్షసిద్ధమని వైభాషికులు బాహ్యార్థమున్నది కాని ప్రత్యక్షముకాదు. బుద్ధ్యాకారముచే అనుమానింపఁ దగినది అని సౌత్రాంతికులు। బాహ్యపదార్థము ప్రత్యక్షముకానపుడు దానిని అనుమానించుట యెట్లు కనుక బుద్ధినే అంగీకరింపవలెను అని యోగాచార్యులు బుద్ధికూడ స్థాయికాదు అని మాధ్యమికులు అందురు.

**మాధ్యమిక మతము—**

నసన్నాసన్న సదసన్నచో భాభ్యాం విలక్షణం
చతుష్కోటి సమాయుక్తం తత్త్వం మాధ్యమికా విదుః

1) తత్త్వము సత్తునుగాదు. 2) అసత్తునుగాదు. 3) సదసత్తులు గాదు 4). సదసత్తులుకంటె విలక్షణమును గాదు. ఇట్లుతత్త్వము నాలుగు విధములైనదానిలో ఏదియునుకాదు.

యదసత్కార ణైస్తన్న జాయతే శశశృంగవత్
సతశ్చోత్పత్తిరిష్టాచేత్ జనితంజనమేధయం

అసత్తు చెవులపిల్లి కొమ్మువలె ఏకారణములచేతను పుట్టదు,

ఏకస్య సదసద్భావో వస్తునో నోపపద్యతే
ఏకస్య సదసద్వ్యయం వైలక్షణ్యంచ యుక్తిమత్.

ఇంకసత్తు పుట్టుననిచో ఇది పుట్టినదానినే పుట్టించువనవలెను. ఒకే వస్తువు సత్తును అసత్తును అగుటకు వీలులేదు, ఈవస్తువు సదసత్తులకంటె విలక్షణము అనుట యుక్తి యుక్తముకాదు.

చతుష్కోటి వినిర్ముక్తం శూన్యం తత్త్వమితిస్థితం
జాతిర్జాతిమతోభిన్నా నవేత్యత్ర విచార్యతే

ఇట్లు నాలుగురీతులునుగాను లేకుండ తత్త్వము కేవలము శూన్యమే అనితేలుచున్నది.

భిన్నాచేత్ సానగృహ్యేత వ్యక్తిభ్యోంగుష్ఠవత్ పృథక్
అవిచారిత సంసిద్ధా వ్యక్తిః సాపారమాణుకీ.

ఇంకజాతివ్యక్తికంటె భిన్నమా? కాదా? అనునది పరిశీలింపఁబడును, జాతివ్యక్తులు భిన్నములైనచో అంగుష్ఠమువలె వేఱుగా గ్రహింపబడక పోవలెను, అవిచారితముగా సంసిద్ధమైన వ్యక్తి అది పరమాణువులది

స్వరూపం పరమాణూనాం వాచ్యం వైశేషికాదిభిః
షట్కేనయుగపద్యోగే పరమాణోష్షడంశతా

పరమాణువులపైని విశ్వాసముగల వైశేషికాదులు పరమాణువుల స్వరూపమును చెప్పవలసియున్నారు. వారిమతమునసుసరించి పరమాణువులు ఇతర పరమాణువులతోఁ గలియును త్వక్కుజిహ్వ చెవులు ముక్కులు

కన్నులు మనస్సు అనువానిచే అణువైపుల ఒక్కమాటుగాఁ గలియును. అపుడది అణుభాగములుగాన పరమాణువులెట్లగును, త్వగాదిసహితమైన అణుపరమాణువులు ఒకచోటనే యుండునన్నచో వస్తువు పరమాణ్వంతద్దే యగునుగాని స్థూలముకానేరదు.

షణ్ణాం సమానదేశత్వేపిండః స్యాదణుమాత్రకః
బ్రాహ్మణత్వాది జాతిఃకిం వేద పాఠేనజాయతే

సంస్కారైర్వాద్వయేనార్థం తత్సర్వం నోపపద్యతే
వేదపాఠేన చేత్కశ్చిత్ శూద్రోదేశాంతరాగతః

బ్రాహ్మణత్వాది జాతి వేదే పాఠముచేతఁ గలుగునా? లేక సంస్కారము చేతనా? లేక రెండిటిచేతనా, అది యేదియుకుదరదు. వేదపాఠముచేత బ్రాహ్మణుఁడగునన్నచో దేశాంతమునుంచి వచ్చిన శూద్రుఁడుగూడ వేదములు బాగుగాఁ జదివి బ్రాహ్మణుఁడు కావలసివచ్చును.

సమ్యక్పఠిత వేదోపి సబ్రాహ్మణత్వమాప్నుయాత్
సర్వసంస్కార యుక్తోత్ర విప్రోలోకే న దృశ్యతే

చత్వారింశత్తు సంస్కారా విప్రస్య విహితాః యతః
ఏకసంస్కార యుక్తశ్చేత్ విప్రఃస్యాదఖిలోజనః

నలుబది సంస్కారములు బ్రాహ్మణునికి విహితముకాన సంస్కారము లన్నియుఁ గలవాఁడెవ్వడును/లోకమునఁగనిపింపఁడు. ఒక సంస్కారము గలవాఁడు గూడ విప్రుఁడగును నన్నచో అందఱు విప్రులేయగుదురు జాతి వ్యక్త్యాత్మకమైన వస్తువులేదని నిరూపింపఁబడఁగా జ్ఞేయము లేనప్పుడు జ్ఞానమెయెక్కడిది. కాన విజ్ఞానము లేదు "అని మాధ్యమికులు సర్వము శూన్య మనియుందురు" (అనిశఁకరులు)

జాతివ్యక్త్యాత్మకోఽర్థోత్ర నాస్త్యేవేతి నిరూపితే
విజ్ఞానమపనాస్త్యేవ జ్ఞేయాభావే సముత్థితే

ఇతిమాధ్యమికై ర్నోక్తం శూనత్వం శూన్యవాదినా (శంకరులు)
నిరాలంబవాదీతు యోగాచారో నిరస్యతి

శూన్యవాదియగు ఇట్లు మాధ్యమికునిచే చెప్పబడిన శూన్యత్వమును నిరాళంబవాదియగు యోగాచారుడు నిరసించుచున్నాడు.

ఇది మాధ్యమిక మతము

ఇంక యోగాచార మతము

అసంగుడు వసుబంధువు ఇద్దరుసోదరులు. పేషావరులో ఒకబ్రాహ్మణుని యింటపుట్టిరి. వసుబంధువు దిజ్ఞాగుని గురువు. వసుబంధువు చంద్రగుప్తునికి (విక్రమాదిత్యుడు) చదువుచెప్పెను. క్రీస్తు. 350లో ఉండిరి. అసంగుడు మహాయానోత్తర తంత్రము 2) సూత్రాలంకారము 3) యోగాచారము 4) వస్తుసంగ్రహము 5) బోధిసత్త్వపిటకావునవాదము అను 5 గ్రంథాలు వ్రాసెను. వసుబంధువు అభిధర్మకోశము. మొ॥ వ్రాసెను. దిజ్ఞాగుడు కంజీపరమున సింహవక్రగ్రామములో క్రీ.శ 4 5 బ్రాహ్మణుని యింటపుట్టెను. ప్రమాణసముచ్చయును అను గ్రంథము వ్రాసెను ధర్మకీర్తి చోళప్రాంత మునతిరుమలై గ్రామమున క్రీ. 600 లోపుట్టి తండ్రికోరునంద. న్యాయవార్తికమువ్రాసెను వేదములు చదివినాలందవెళ్ళెను అసంగుడు వసుబంధువు దిజ్ఞాగుడుధర్మకీర్తి మొదలగువారుబంధులయిరి సర్వముక్షణికము సర్వము దుఃఖము సర్వము స్వలక్షణము సర్వము శూన్యము అని గురువుచెప్పిన నాల్గు భావములను బాహ్యార్థమును శూన్యత్వమును అంగీకరించి ఆంతరమునకు శూన్యత్వమునుగూడ ఎట్లు అంగీకరింపబడినదను * పర్యనుయోగమును చేయుటవలన కొందరు యోగాచారులనబడిరి. వారిపరిభాషయిది.

తనయోక్త సర్వశూన్యత్వే ప్రమాణం శూన్యమేవతే
అతోవాదేఽధికారస్తేన పరేణోపపద్యతే (శం)

---

* పర్యనుయోగము దుషణకై జిజ్ఞాసను. యోగాచార్యులు = అప్రాప్తమైనదానిని పొందుటకు చేయుపర్యనుయోగము. యోగము గురువుచెప్పినది అంగీకరించుట ఆచారము. రెండుగలవారు యోగాచారులు.

సర్వముశూన్యము అని నీవు చెప్పినదానిలో ప్రమాణము శూన్యమే కనుక పరునితో వాదముచేయుటలో నీకు అర్హతయేలేదు, స్వయంవేద్యమైతే అంగీకరించఁబడినది అట్లుకానిచో జగత్తు అంధకారమగును. అదిధర్మకీర్తిచేఁ జెప్పఁబడెను.

అప్రత్యక్షోపలంభ స్యనార్థదృష్టిః ప్రసిధ్యతి

"ప్రత్యక్షముగా ఉపలబ్ధముగాని దాని అర్థసిద్ధి ప్రసిద్ధముకాదు" వికల్పములు ఉపపన్నములుగావు కనుక బాహ్యము గ్రాహ్యమగుట అది ఉపపన్నముగానేకాదు. అర్థము జ్ఞానముచే గ్రహింపఁదగినదగుచు ఉత్పన్నమగునా ఉత్పన్నముకాదా. ఉత్పన్నమునకు స్థితిలేదుగాన ఉత్పన్నమగు ననరాదు. అనుత్పన్నమైనది లేకపోవుటవలన అనుత్పన్నమగుననరాదు. జ్ఞానజనకమగుటవల్ల అతీతమైన యర్థమె జ్ఞానగ్రాహ్యము, అని తలంతు నేని అదియు బాలభాషితమెయగును. ఏలయన అపుడువర్తమానత్వావభాసకు విరోధమగును. ఇంద్రియాదులు జ్ఞాన జనకములు గాన అవియు గ్రాహ్యములు కావలసివచ్చును. మఱియు ఆ గ్రాహ్యవస్తువు పరమాణు రూపమా ? పదయువరూపమా. కర్త్రైకదేశవిచికిత్సాదులను బట్టి దానిని నిరాకరించుటచే ఘటాద్యవయవి రూపముకాదు. అతీంద్రియమగుటవలనను జ్ఞానేంద్రియాను రూపషట్కముచే ఒక్కమాటుగా యోగమును పొంది బాధలుగుటవలనను పరమాణురూపముగాదు. అదియుచెప్పబడెను.

షట్కేనయుగ పద్యోగాత్పరమాణోః షడంశతా
తేషా మప్యేకదేశత్వాత్పిండః స్యాదణుమాత్రకః

"మనస్సు జ్ఞానేంద్రియములను ఈ యారింటిచే యుగపద్యోగము వలన పరమాణువు షడంశముగలది కావలెను. వానిలోను ఏకదేశమైనచో పిండము అణుమాత్రకమగును. కనుక తనకంటె ఇతరమైన గ్రాహ్యవస్తువు లేకపోవుటవలన తద్రూపమైన బుద్ధి స్వయముగానె స్వాత్మరూప ప్రకాశ ప్రకాశమువలె నుండుననుట సిద్ధము.

యుండు, చిత్తవృత్తులతోఁగూడి యుం డెడి అహం శబ్దార్థమైన సాక్షితోడి తాదాత్మ్యము, భ్రాంతి జన్యతాదాత్మ్య మనఁబడును.

**తాదాత్మ్యము-** ఏకీభావము. కూడిక లేక కలయిక.

**తామసజ్ఞానము-** కారణము లేనిదియు అసత్యమునునైన యొక కార్యమే సర్వార్థసిద్ధియని దానియం దాసక్తిఁ గలిగియుండునట్టి జ్ఞానము.

**తామసతపస్సు-** తెలివిలేని పట్టుదల తోడను కష్టముగను జేయు తపస్సు.

**తామసపూజ-** భూతప్రేతములకుఁజేయు పూజ.

**తామిస్రము-** విషయ భోగేచ్ఛకు విఘాతము కలుగుట వలనఁ గలుగు క్రోధము.

**తారకము-** ఓంకారము. వివేకమువలనఁ బుట్టిన జ్ఞానము.

**తారము-** ఓంకారము. ఈ యోంకారము నుచ్చరించుట వలన జననమరణ రూపమగు సంసారమును దరింపఁ జేయును కావున తారమనంబడును.

**తార్కికమతము-** జగత్తునకు పరమా ణువులే కారణమను సిద్ధాంతముగల మతము. ఈ దర్శనమునకు కాణాద మను పేరుకూడ కలదు. దీని మూల కర్త కణాదుఁడను ఋషి.

**తితీక్ష-** ప్రారబ్ధ వశమునఁ గలుగు సుఖదుఃఖాదులగు ద్వంద్వముల సహించుట.

**తిరుపణ్యులు-** వైష్ణవ మతమును స్వీకరించిన పంచములు.

**తిరుమంత్రరహస్యము-** బదరికాశ్రమ మందు పరమేశ్వరావతారమగు నరుని విషయము.

**తిరుమంత్రము-** విశిష్టాద్వైతుల ననుసంధానముఁజేయుఅష్టాక్షరియను ప్రణవపూర్వక నమోనారాయణాయ అను మంత్రము. ఇందు మూడు పద ములుగ విభజింపబడి మూడర్థముల దెలుపుచున్నది. మొదటి పద మగు ఓంకారమున శేషత్వమున్ను, రెండవ పదమగు నమః అను దానికి పారతంత్ర్యమున్ను, మూడవ పద మగు నారాయణాయ అను దానికి కైంకర్యమున్ను, తెలుపుచున్నవి.

**తిరోధానమలము-** పర బ్రహ్మమందు అనిత్య బుద్ధినిఁ బుట్టించి బ్రహ్మేతర మందు నత్యబుద్ధినిఁ గలిగించి దుఃఖింపఁ జేయునది.

**తులసి-** విష్ణు పూజకు మిగుల శ్రేష్ఠ మగు పత్రి. తులసియందు పెక్కు సుగుణములుండుటచే భక్తులకేకాక వైద్యులకును ప్రియతమమైనది. తుల సికి సంస్కృతమున "సురస" యని యు, తెనుఁగున "గగ్గెర" యనియు, అంగ్లమున "హెూవీబేసిల్" అనియు, పేర్లు. తులసిలోఁ బలు జాతులుగలవు. తులసి, కృష్ణతులసి, రామతులసి, లక్ష్మీతులసి, మరువక తులసి వీనిని మాత్రమే భగవదార్చన కుపయోగింతురు. భూతులసి, అడవి తులసి, రుద్రజడతులసి. కుక్క తులసి. వీనిని మందులకు మాత్రమే యుపయోగింతురు.

**తురీయము-** నాల్గవ అవస్థ. బ్రహ్మము. నాల్గవది. సప్తజ్ఞాన భూమికలలోనొకటి.

మోదకములందు ఆశగలవారికిని మోదకములు సంపాదించినవారికిని వానిరసవీర్య విపాకాదులు కలుగవని తెలియఁదగును. వాస్తవముగా వేద్యము వేదకము మొదలైన ఆకారములు లేని బుద్ధియును వ్యవహర్తల పరిజ్ఞానమును అనుసరించి విభిన్నములైన గ్రాహ్యగ్రాహకాకార రూపములు గలదగుటచేత తిమిరాది దోషములచే కండశక్తి పోయినవారికి కేశములకు ఉండుకములకు = సాలెగూడువంటి దారములకు జ్ఞానములకు సర్పములకును భేదముగగలనట్లు అనాది మిథ్యాజ్ఞాన వాసనాసామర్థ్యమువల్ల గ్రాహ్యగ్రాహకాది భేదబుద్ధికలుగుట లేదను వ్యవసమువపన్నమగుటవల్ల ప్రశ్నయెకలుగదు. ఎట్లనఁగా

అవేద్యవేద్యకాకారా యథా భ్రాంతైర్నిరీక్ష్యతే
విభక్తలక్షణ గ్రాహ్యగ్రాహకాకార విప్లవా

తథాకృత వ్యవస్థేయం కేశాదిజ్ఞానభేదవత్
యదా తదా న్నచోద్యా బుద్ధ్యా గ్రాహ్యగ్రాహకలక్షణా

అవేద్యమందు వేదకాకారములు లేని (విజ్ఞానమె నీలాదికము అను) బుద్ధివిభక్తమైన లక్షణములుగల గ్రాహ్యగ్రాహకాకారములు విప్లవముగాఁ గలదిగానెట్లు భ్రాంతులచే నిరీక్షింపఁబడుచున్నదో అట్లే కేశాదిభేదజ్ఞానమువలె ఈబుద్ధి వ్యవస్థగలది. అదియెప్పుడో యెకప్పుడు గ్రాహ్యగ్రాహక లక్షణములుగలదై సంచోద్యము కాదు. అని చెప్పఁబడెను. కనుక బుద్ధియే అనాది వాసనావశమువల్ల అనేకాకారములుగలదై అవభాసించును. అని సిద్ధించినది. కనుక ఇదివఱలోఁ జెప్పఁబడిన భావనాప్రచయ బలమువలన నిఖిలవాసనల యుచ్ఛేదముచేత విగళితమైన వివిధవిషయాకార విప్లవముగలదై విశుద్ధమైన విజ్ఞానోదయముగలది మహోదయమె (మోక్షమె) అగునని తెలియవలయును

దీనిని ప్రతీత్య సముత్పాద మందురు. ప్రతీత్య=ఒకటి నశించిన పిదప రెండవది పుట్టును అను నియమము. దీనికవిఛిన్న ప్రవాహమందురు దీనిని అవిచ్ఛిన్న ప్రవాదమని బుద్ధుండనలేదు. దీనితరువాత ఇదియగునని యందురు. ఒక దీపమునుండి యింకొక దీపమువెలుగుట ప్రతీత్య సముత్పా

దమును విచ్ఛిన్నప్రవాహమును తీసుకొని నాగార్జునుడు తన శూన్యవాద ము విలసితముచేసెనని రాహుల సాంకృత్యాయనుడు దర్శనదిగ్దర్శనములో చెప్పెను. (చూ. దర్శనదిగ్దర్శన. 51౪ పుట)

ప్రతీత్య=నశించి, ఉత్పాద = పుట్టుట.

ఒకటి గడచుటవల్ల (నశించుటవల్ల) ఒకటి పుట్టుట అనిప్రత్యుత్పత్తి.

ఇది

యోగాచారమతము

— ౦ —

సౌత్రాంతికమతము

యోగాచారులైతే విజ్ఞానమొకటే కలదనిరి. జ్ఞేయములేకుండ జ్ఞానము ఉండదుగాన బాహ్యమునుగలదు. బుద్ధిరూపముపొంది నీలపీతాదిచిత్రములచే బాహ్యార్థము అనుమానింపబడుచున్నదని సౌత్రాంతికులు

విజ్ఞానమాత్రముత్యుక్తం, యోగాచారేణధీమతా
జ్ఞానం జ్ఞేయం వినానాస్తి, బాహ్యార్థోఽప్యస్తి తేన నః

నీలపీతాదిభిశ్చిత్రైర్బుద్ధ్యాకారైరిహాంతరైః
సౌత్రాంతికమతే నిత్యంబాహ్యార్థస్త్వనుమీయతే। (శంకరులు)

చక్షురాదులు రూపాది పంచకమంటె క్షీణించును. దానినిగ్రహించు ఆరవ యింద్రియము మనస్సు అది వెలుపలంగాలేదు. ఆకాశధాతువే పరమాణువుగా చెప్పఁబడెను. అదిజ్ఞానమేకాని యితరవస్తువుగాదు"

క్షీణానిచక్షురాదీని రూపాదిష్వేవపంచసు
న షష్ఠమింద్రియం తస్యగ్రాహకం విద్యతేబహిః

షడంశత్వం త్వయాపాద్య పరమాణోర్నిరాకృతిః
యుక్తస్తేనాపిబాహ్యార్థోన చేద్జ్ఞానం ససంభవేత్

ఆకాశధాతు భిరస్మాభిః పరమాణురితీరితః
ప్రసచప్రజ్ఞప్తి మాత్రంస్యాన్నచ వస్త్వంతరంమతమ్

సర్వేవదార్థాః క్షణికాబుద్ధ్యాకార విజృంభితాః
ఇదమిత్యేవ భావాస్తేఽప్యాకారానుమితాస్సదా

విషయత్వవిరోధస్తు క్షణికత్వేఽపినాస్తినః
విషయత్వంహి హేతుత్వం జ్ఞానాకారార్పణక్షమం (శంకరాచార్యులు)

ఇతరులైన సౌత్రాంతికులైతె ఇట్లుతలంచుచున్నారు. ప్రమాణములేక పోవుటవలన ఇదివఱలోఁజెప్పఁబడిన బాహ్యవస్తుజాతము లేదనుట (జ్ఞేయములేకుండ జ్ఞానముఉండదు కాన)అయుక్తము (వేద్యవేదములకు విషయ జ్ఞానములకు) అభేదమును సాధించుటలో అభిమతమైన సహోపలంభముకూడ నొకదానియొకటి కలిసియుండు నియమము అప్రయోజకమగుట (అనుకూల తర్కరహతమగుట) చేత అది సందిగ్ధ విపక్షవ్యావృత్తికము కాన సహోపలంభ నియమము ప్రమాణమనరాదు. మఱిభేదమందు సహోపలంభ నియమరూప మైన సాధనములేదు అన్నచో జ్ఞానము అంతర్ముఖమగుటచేతను జ్ఞానము ఆత్మనిష్ఠము ఘటము భూతలనిష్టము కాన అవిరెండు భిన్నముగా ప్రతిభాసించుటవలనను ఏకదేశత్వైక కాలత్వలక్షణ సహత్వనియమము అసంభవమగుట వలనను—అట్లనరాదు. నీలాద్యర్థము జ్ఞానాకారముకాఁగా నేనుఅను ప్రతిభాస కలుగును. జ్ఞానాత్మ వాస్తవమునకు జ్ఞానముకంటె భిన్నముకాదు. అవ్యతిరేకమగు ప్రత్యయమువలన అదియును ప్రతిప్రత్తిమాత్రముకాదు. నీలాకారము జ్ఞానస్వరూపమైనను భ్రాంతిచే బాహ్యమువలె భేదముగా ప్రతిభాసంచునని చెప్పుమరేని నేను ఘటము ఎఱుఁగుదునని ప్రత్యయముండుట వలన జ్ఞానమెకాని అక్కడ నేనను ఉల్లేఖము కలుగదుకూడ. అట్లునుచెప్పబడినది.

పరిచ్ఛేదాంతరాద్యోయం భాగోబహిరివస్థితః
జ్ఞానస్యాభేదినాభేదప్రతిభాసో ప్యుపప్లవః ఇతి
యదం తద్జ్ఞేయతత్త్వం తద్బహిర్వదవభాసతే ఇతిః

జ్ఞానముయొక్క ఆంతరికమైన విషయప్రకాశ రూపమైన భాగము కంటె వేరుగ ఏభాగము బాహ్యము (జ్ఞేయాకారము) వలెనున్నదో, అట్లే అభేద జ్ఞానముయొక్క అభేదప్రతిభావము గూడమవిషమె,

ఏది అంతర్జ్ఞేయతత్త్వమో అది బ్రాహ్యమువలె అది అవభాసించును"

బాహ్యార్థములేనపుడు అది వ్యుత్పత్తిరహితమగుటచే (బహిశ్శబ్దార్థమైన రహితమగుటచే) బాహ్యమువలె అను ఉపమానోక్తియుక్తిలేనిది కాన అది అయుక్తము. వసుమిత్రుడు గొడ్డురాలికొడుకువలె భాసించుచున్నాఁడు. అని మంచిదృష్టిగలవాఁడెవ్వఁడును చెప్పఁడు అట్లుచెప్పినచో అప్పుడు భేదప్రతిభాస భ్రాంతియుక్తమగునని పరస్పరాశ్రయ ప్రసంగమును కలుగును. ఇది సర్పముకాదు అని బాధకనిపించుటచే త్రాటియందు సర్పజ్ఞానము భ్రమయని నిశ్చితమగుచున్నది. కనుక ఇట భేదము బాధింపబడుటలేదు. అట్లును భేదజ్ఞానమునకు భ్రమత్వము. విషయవిజ్ఞానముల యైక్యజ్ఞానముయొక్క ప్రామాణ్యముచేతనే నిశ్చయింపదగును. ప్రామాణ్యనిశ్చయముకూడ భేదజ్ఞానము భ్రమమని నిశ్చయమున్నపుడే కలుగునుగాని మరొకవిధముగకాదు. లోకమున విషయజ్ఞానములకైక్య జ్ఞానమెలేదు. ఎట్లు ఇంకదానికి ప్రామాణము కనుక ఇట్లు పరస్పరాశ్రయదోషము గలుగుచున్నది. విసంవాదము లేకపోవుటచే నీలాదికమునె తెలిసికొనుచున్నవారై బాహ్యమునె జగత్తులో స్వీకరించుచు అంతరమును ఉపేక్షించుచున్నారు అను వ్యవస్థచూడబడుచున్నది. కనుకను అదియు యుక్తమె. ఇట్లయినపుడు ఈయభేదమును సాధించు హేతువు. * గోమయపాయసీయ న్యాయమువలె ఆభాసత్వమును పొందును. నీలాకారము జ్ఞానస్వరూపమైనను భ్రాంతిచే బ్రాహ్యమువలె ప్రతిభాసించును అని చెప్పునీచేత బాహ్యము గ్రాహ్యమె అని భావింపదగినది. అని బాహ్యార్థమును అంగీకరించని నిన్ను నీబాణమెకొట్టును.

---

* గోమయము పాయసమును గోసంబంధులు అగుటవలన రెండును అభిన్నములె అని అసత్తర్కముచే తెలుపుట.

విషయమెప్పుడును జ్ఞానముకంటె ముందె యుండును కనుక జ్ఞానము కంటె భిన్నకాలము కలపదార్థము గ్రాహ్యమనుట అనుపపన్నమన్నచో ఇంద్రియసంనికృష్టమైన విషయమునకును ఉత్పాద్యమైన జ్ఞానమందు స్వాకార సమర్పకతగా సమర్పితమైన ఆకారముచేతనుగూడ ఆయర్థము అను మేయమనుట యుపపన్నముకాదు కనుక–అట్లనుట అనుపపన్నము. కనుకనే పర్యనుయోగము (ప్రశ్నము) దానికిపరిహారము బాగుగా గ్రహింపబడునుగాక.

భిన్నకాలము ఎట్లు గ్రహింపదగినది అన్నచో ఘటాదివ్యక్తికి జ్ఞానాకారమును అర్పించుటకు క్షమమగుట హేతువు. అదె దానికి గ్రాహ్యత" అని యందురు. కనుక పుష్టిచేతభోజనము భాషచేదేశము ఆదరముచె స్నేహమును అనుమానింపబడునట్లు జ్ఞానాకారముచేత జ్ఞేయము అనుమానింపదగినది. అదియును క్రిందజెప్పబడుచున్నది.

అర్థముచేత జ్ఞానమును ఘటింపజేయును. అర్థరూపమును విడిచినచో మాత్రము జ్ఞానమును ఘటింపజేయును కనుక జ్ఞానమునకు విషయాకారత్వమె విషయజ్ఞానమునకు ప్రమాణము" అని

విషయముల ప్రకాశము కేవలము జ్ఞానముయొక్క యునికియె అని యనరాదు. ఏలయన అజ్ఞానము ఘటపటాదులందు విశేషముగలేకుండ ఉన్నది కనుక అట్లన్నచో ఘటపటాదులకు భేదమెలేకుండ పోవలసివచ్చును. కాని విషయసారూప్యము జ్ఞానమును ప్రవేశించుచున్నదై జ్ఞానము సమానాకారము కలదానినిగాజేయుటకు దానిని విషయములతో గూర్చునుకూడ అట్లు జ్ఞానముకంటె వేఱుగా బాహ్యార్థము ఉన్నదనుటకు ప్రయోగమున్నది ఏమంటె రాదులు ఏబీజాదులందున్నను అట్టినీరు మొదలైన యితరవస్తువులను అపేక్షించి యొక్కప్పుడె కనిపించును. స్వభావసిద్ధముగా మాటాడుటకిష్టపడక వెళ్ళుటకిష్టపడకయున్న నాయందున్న ఒకప్పుడు కలిగిన మాటనడకలు మాటాడుటకిష్టపడి వెళ్ళపలచియున్న యింకొక పురుషుని విజ్ఞానసంతానమే (ఒకపుడు నామాట నానడక తెలియుపురుషుడిక్కడ ఇంకొకపురుషుడుండవచ్చునను జ్ఞానపరంపరయే) అపేక్షింపగలది టును ఘటము అవునా కాదాఅను

కన్నులు మనస్సు అనువానిచే అణువైపుల ఒక్కమాటుగాఁ గలియును. అపుడది అణుభాగములుగాన పరమాణువులెట్లగును, త్వగాదిసహితమైన అణుపరమాణువులు ఒకచోటనే యుండునన్నచో వస్తువు పరమాణువంతదే యగునుగాని స్థూలముకానేరదు.

షణ్ణాం సమానదేశత్వే పిండః స్యాదణుమాత్రకః
బ్రాహ్మణత్వాది జాతిః కిం వేద పాఠేన జాయతే

సంస్కారైర్వాద్వయేనార్థం తత్సర్వం నోపపద్యతే
వేదపాఠేన చేత్కశ్చిత్ శూద్రోదేశాంతరాగతః

బ్రాహ్మణత్వాది జాతి వేదపాఠముచేతఁ గలుగునా? లేక సంస్కారము చేతనా? లేక రెండిటిచేతనా? అది యేదియుకుదరదు. వేదపాఠముచేత బ్రాహ్మణుఁడగునన్నచో దేశాంతమునుండి వచ్చిన శూద్రుఁడుగూడ వేదములు బాగుగాఁ జదివి బ్రాహ్మణుఁడు కావలసివచ్చును.

సమ్యక్పఠిత వేదోపి సబ్రాహ్మణత్వమాప్నుయాత్
సర్వసంస్కార యుక్తోత్ర విప్రో లోకే న దృశ్యతే

చత్వారింశత్తు సంస్కారా విప్రస్య విహితాః యతః
ఏకసంస్కార యుక్తశ్చేత్ విప్రః స్యాదఖిలో జనః

నలుబది సంస్కారములు బ్రాహ్మణునికి విహితముకాన సంస్కారము లన్నియుఁ గలవాఁడెవ్వడును/లోకమునఁగనిపింపఁడు. ఒక సంస్కారము గలవాఁడు గూడ విప్రుఁడగును నన్నచో అందఱు విప్రులే యుపుదురు జాతి వ్యక్త్యాత్మకమైన వస్తువులేదని నిరూపింపఁబడఁగా జ్ఞేయుమె లేనప్పుడు జ్ఞానమెయెక్కడిది. కాన విజ్ఞానముకేమ “అని మాధ్యమికులు సర్వము శూన్య మనియుందురు” (అనిశంకరులు)

జాతివ్యక్త్యాత్మకోఽర్థోత్ర నాస్త్యేవేతి నిరూపితే
విజ్ఞానమపనాస్త్యేవ జ్ఞేయాభావే సముత్థితే

వాసనకూడ సమర్థముకాకపోవును. అన్నివాసనలును సమర్థములే అనుపక్ష ములో ఒకకాలమందు పరిపక్వము అగును. ఇంకొకపుడుకావు. అని కాలమున ఆక్షేపించుటయనుప పన్నమగును. కనుక ఒకానొకప్పుడె పరిపక్వమగునను వాదమును నిర్వహించుటకై సుఖాదివిషయములైన శబ్దస్పర్శ రూపరసగం విషయములుగల ఆరువిజ్ఞానములును నాలుగు ఆలంబనాది ప్రత్యయములను పతింతించి (అతిక్రమించి) పుట్టుచున్నవి అని యిష్టములేకున్నను శుద్ధ బుద్ధియగువానిచే స్వానుభవమును కప్పిపుచ్చ పరిచ్ఛేదము(నిర్ణయము) చేయవలసియున్నది.

ఆనాలుగుప్రత్యయములు ఆలంబన ప్రత్యయములు సమనంతర ప్రత్యయము సహకారి ప్రత్యయము అధిపత్యయిము అని ప్రసిద్ధములు విషయమె ఆలంబనప్రత్యయము. అందుజ్ఞానపదముచేత తెలియదగిన నీలాదిప్రకాశముగల చిత్తమునకు నీలమైన ఆలంబన ప్రత్యయమువలన నీలాకారత్వమును సమనంతర ప్రత్యయముగల ప్రాచీనజ్ఞానమువలన బోధ రూపత్వమును సహకారి ప్రత్యయముగల యాలోకమువలన స్పష్టత్వమును కంటి యొక్క యధిపతి ప్రత్యయమువలన విషయగ్రహణ ప్రతినియమము కలుగును. విషయమె ఆలంబన ప్రత్యయము చిత్తక్షణిక జ్ఞానమందు ఆకారగ్రహణ సామర్థ్యమును ఇచ్చుచున్న పూర్వక్షణిక జ్ఞానము సమనంతర ప్రత్యయమున జ్ఞానమందు వైశద్యమును ఇచ్చునాలోకమె సహకారిప్రత్యయము మనస్సంయోగాదికము సహకారియె ఇంద్రియము అది పతిప్రత్యయము. అది పతినియామకుడని లోకములో నియామకునికి అధిపతిత్వము కలుగును. అట్లే ఉదితమైన జ్ఞానమునకు రసాదిఉపాదిసాధారణ్యము ప్రాప్తింపంగా నియామకమగుచక్షువు అధిపతియగుట దగియున్నది. చిత్తమునకుచిత్త సంబంధములగు సుఖదుఃఖాలు నాలుగు కారణములు చూడదగియున్నవి చిత్తము చిత్తసంబంధులను సుఖాదులరూపమైన స్కంధము రూపము విజ్ఞానము వేదనసంజ్ఞ సంస్కారము అనుపేర్లలో నైదువిధములుగనున్నది. భూతములు కంటెనేదైనయమూర్త తత్త్వములు స్కంధమనబడును. రూపాదిపంచ స్కంధ ములందు రెండవ విజ్ఞానము స్కంధము చిత్తము. ఇతస్కంధములు చిత్త ములకు సంబంధించినవి విజ్ఞానము ఆలయవిజ్ఞానము ప్రవృత్తి విజ్ఞానమున

నది బ్రహ్మరంధ్రము, దీనినే ద్వాదశాంతమందురు. అనాహతమునను గూఢ ద్వాదశాంతమని కొందఱను చున్నారు.

**ద్వాదశేంద్రియములు**— జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుపది. మనోబుద్ధులు రెండు చేరి పండ్రెండు ఇంద్రియములు.

**ద్వామిష్యాయణుఁడు**— కొడుకులు లేని తండ్రి తన కూతురిని కన్యాదానము చేయునపుడు నీ కన్యాగర్భ సంజాతుఁడగు పుత్రుఁడు తనకున్న పారలౌకిక క్రియల నాచరింపవలయునని అల్లునితో నొడంబడికఁగావించుకొనిన యెడల నా కన్యకు పుట్టిన పుత్రుఁడు.

**ద్విమాత్రికాలము**— దీర్ఘాక్షరోచ్చారణ కాలము.

**ద్వివిధసుఖములు**— ఇహపర సుఖములు.

**ద్వివిధధ్యానములు**—సగుణ ధ్యానము నిర్గుణ ధ్యానములు.

**ద్వివిధప్రారబ్ధములు**— అభ్యుపగత ప్రారబ్ధము, అభ్యుపగత ప్రారబ్ధము

**ద్వివిధమార్గములు**— ఇష్టాపూర్తము లొనర్చినవారు చంద్రలోకమున కరిగెడి ధూమాది మార్గము.

వైరాగ్యోపశాంతి గలవారు సూర్యలోకమున కరిగెడి అర్చరాది మార్గము.

**ద్వివిధవాక్యములు**— జీవేశ్వరభేద నిరూపణ యుక్తములగు అవాంతర వాక్యములు జీవేశ్వరులకైక్య నిరూపణ యుక్తములగు మహావాక్యములు.

**ద్వేషము**— దుఃఖానుభవానంతరము అంతఃకరణమున నా దుఃఖ కారణ విషయములందు గలుగు క్రోధము. దీనికి పర్యాయనామములు. దుఃఖ ప్రతిఘాతము, మన్యువు, జిఘాంస, క్రోధము ఇత్యాదులు.

**ద్వేషక్లేశము**— పంచక్లేశములలో నొకటి. అనగా నుదర పోషణార్థము. పరుల నాశ్రయించి వారి వలనఁ వనయభిమతము కొనసాగనందున వారల ద్వేషించుట.

**ద్వైతజ్ఞానము**— భేదజ్ఞానము. చిత్తు, జడము, ఈశ్వరులను త్రివిధభేదములు కలది,

**ధనగతిత్రయము**— దానము, భోగము, నాశము.

**ధనురాసనము**— పాదాంగుష్ఠముల రెంటిని రెండుచేతులతో ధనురాకృతిగ వీపువైపునఁ జెవుల వరకు నరిగ బట్టి యుండుట.

**ధర్మసమ్మూఢులు**— ధర్మమును నిర్దారణఁ జేయఁజాలని మూఢులు.

**ధాతుసప్తకము**— త్వఙ్మాంస రుధిర మేధోఽస్థి మజ్జా శుక్రములు.

**ధారణ**— నాభి మున్నగు చక్రాదులందు చిత్తమును చలింపక నిలుపుట. ప్రణవ నాదముల వినుటయందు చొక్కిన మనస్సు. చపల చిత్తమును పూర్తిగవిడచి రెక్కలు విరిగిన పక్షి యెగురఁజాలనియట్లు చలింపశక్తిలేక స్థిరత్వమునః బొందిన యవస్థ.

పుట్టుచున్నది. ఇక్కడ నేనిట్టి కార్యమును చేయుచున్నాను." అను జ్ఞానము ఈ యాఱు ధాతువులకు ఉండదు. దీనిచే నిది ఉత్పన్నమైనదను జ్ఞానము గాని దానికి లేదు. కనుక కారణ సమవాయమునకె ఇది ఫలమని నిశ్చయ మగుచున్నది. ఇంక అందు పృథివీ ధాతువు అంకురమునకు కాఠిన్యమును గంధమును జనింపఁజేయుచున్నది. జలధాతువు స్నేహమును రసమును, తేజోధాతువు రూపమును వేడిని, వాయుధాతువు స్పర్శమును చలనమును ఆకాశధాతువు అవకాశమును శబ్దమును జనింపఁ జేయుచున్నది. ఋతు ధాతువు భూమ్యాదులను వీలునుబట్టి గలిగించుచున్నది. హేతూపనిబం ధనమును సంగ్రహింపఁజేయు సూత్రమిది."

ఉత్పాదాద్వాతథాగతానామనుత్పాదాద్వాస్థితైవైతే షాంధర్మాణాంధర్మతా ధర్మ స్థితితా. ధర్మనియామకతా చ ప్రతీత్య సముత్పాదానులోమతా" అని ఉత్పత్తివల్లగాని అనుత్పత్తివల్లగాని బుద్ధులకు ఏ కార్యకారణ రూప ధర్మములకు ధర్మత్వమనఁగా ధర్మమందు (కార్యమందు) కారణములనతిక్ర మించని స్థితియె (ఉండుటయె) ధర్మనియామకత్వమనఁగా ప్రతీత్యసముత్పా దానులోమతమె ఒక స్థితిని పొంది ఇంకొక లీలగా పుట్టుకను అనుసరించు టయె అని.

తథాగతుల మతమున ధర్మము అనఁగా కార్యకారణముల కార్యకారణ భావరూపమైన యే ధర్మత్వమున్నదో ఇది ఉత్పత్తివల్లఁగాని అనుత్పత్తి వల్లఁగాని ఉన్నది. ఏది యుండఁగా ఏది పుట్టుచున్నదో, ఏది లేనప్పుడు ఏది పుట్టుటలేదో అది ఆ కారణమునకు కార్యము. ధర్మత అన్నదానికి ధర్మ స్థితితా ఇత్యాదికము వివరణము. ధర్మమునకు కార్యమునకు కారణమునతిక్ర మింపకుండ ఉనికియె. ధర్మత అనుచోట త అను ప్రత్యయము స్వార్థమందు వచ్చినది. ధర్మత అనఁగా ధర్మము అన్నమాట ధర్మమునకు కారణమునకు కార్యమును గుఱించి నియామకత్వము. ఓయీ ఈ కార్యకారణభావము చేత నము లేకుండ సంభవింపదు కనుక ప్రతీత్య=పొంది అని చెప్పఁబడినది. కారణ ముండగా అది పొంది పుట్టుటలో అనుసరించుటయె. ధర్మోత్పత్తి (కార్యో త్పత్తి) వల్లఁగాని కార్యములో అనుత్పత్తివల్లగాని ఉన్నది. ఇట ఏదైన

చేతనము అధిష్ఠానముగా లభించుట లేదు." అని పై సూత్రమునకర్థము. ఇటువంటి ప్రతీత్య (ఒక స్థితినిపొంది) సముత్పాదమునకు (ఇంకొకస్థితిని పొందుటకు) హేతూప నిబంధము ఎట్లనఁగా:-

బీజమునుండి అంకురము, అంకురమునుండి కాండము కాండమునుండి నాళము నాళమునుండి పొట్టయు దానినుండి శూకము (పోచ) దానినుండి పువ్వు దానినుండి ఫలము అగుట. నేను ఈ యంకురము నిర్వర్తించుచున్నాను. నేను బీజముచే నిర్వర్తింపఁబడితిని" అని ఈ బాహ్యసముదాయమందు బీజాదిక కారణముగాని అంకురాదిక కార్యముగాని తలంచుట లేదు. ఇట్లు ఆధ్యాత్మికములందును కారణద్వయము తెలియదగినది. క్షణికములందు స్థిరత్వ భ్రాంతి అవిద్య. అవిద్యవల్ల విషయప్రీతి రూపసంస్కారము సంస్కారమువల్ల గర్భమందున వానికి నేను అను ఆలయవిజ్ఞానము, దానినుండి పేర్లు, ఆ పేర్లకాధారమైన పృథివ్యాదికము దానినుండి శరీరము, దానినుండి ఇంద్రియములు. పిదప విషయములలో సంబంధము పిదప సుఖాదులు, పిదప వేదన పిదప విషయతృష్ణ, పిదప ప్రవృత్తి, పిదప ధర్మాధర్మములు పిదప గర్భవాసము ఇత్యాదికము. బాహ్యములందువలె ఆధ్యాత్మికములందును కార్యకారణములకు జ్ఞానము లేకుండుట సమానమె. ఇదియె ప్రతీత్య సముత్పాదము. కారణ స్వభావమువల్లనె కారణమును పొంది (ప్రతీత్య) కార్యమునకు ఉత్పత్తి (ఉత్పాదము) అగుచున్నది కాని ఇందు ఇంకొక చేతనము కారణము కాదు అని గ్రహింపఁదగినది.

"పురః స్థితే ప్రమేయాబ్ధౌ గ్రంథ విస్తరభీరుభిః
విస్తారం సంపరిత్యజ్యదిఙ్మాత్రముపదర్శ్యతాం"

ఎదురు సముద్రమంత ప్రమేయము ఉండగా గ్రంధవిస్తరమగునేమో యని భయపడువారు విస్తరించుటను విడిచి దిఙ్మాత్రమె చూపదగును." అను న్యాయమును బట్టి ఈ విషయము ముగింపఁబడుచున్నది.

దుఃఖమును దుఃఖకారణము అను రెంటిని నిరోధించుట, పిదప విమల జ్ఞానము కలుగుటగాని ముక్తి యనఁబడును. వానిని నిరోధించు నుపాయమె

మార్గము. అదియును తత్త్వజ్ఞానమే. అది ప్రాచీన భావనాబలమువల్ల నగు చున్నది. దీనిలోని రహస్యము సూత్రమునకు అంతు అడుగువారికిని చెప్ప బడినది. మీరో మఱి సూత్రమునకంతును అడుగువారు కనుక సౌత్రాంతికు లవ్వుదురుగాక అని బుద్ధభగవానునిచే చెప్పఁబడుటచే సౌత్రాంతికసంజ్ఞ కల్గినది.

— ఇది సౌత్రాంతిక మతము —

## వైభాషిక సిద్ధాంతములు

బాహ్యములైన గంధాదులు, ఆంతరములైన రూపాది స్కంధములు ఉన్నప్పటికిని వానియందు అనాస్థను కలిగించుటకు సర్వము శూన్యము అని మొదటి శిష్యులను గూర్చి భగవానుడు చెప్పెను.

వీరు మాధ్యమికులనఁబడిరి. "విజ్ఞానము మాత్రమే కలదు." అను గ్రహము పట్టిన రెండవవారిని గూర్చి, విజ్ఞానమొకటె సత్తు అని బుద్ధుడు చెప్పెను. వీరు యోగాచారులు.

రెండు అసత్యమని స్థిరబుద్ధిగల మూడవ వారినిగూర్చి విజ్ఞేయ మను మేయమని" బుద్ధుడు చెప్పెను. వీరు సౌత్రాంతికులు.

ఈ భాష "వి(రుద్ధ)భాష" అని వర్ణించు కొందఱు బౌద్ధులు వైభాషి కులని ప్రసిద్ధులైరి. వారి పరిభాష ఇది. విజ్ఞేయానుమేయత్వ (సౌత్రాం తిక) వాదమందు ప్రత్యక్షసిద్ధమైన పదార్థమేదియు లేకపోవుటచేత వ్యాప్తిని తెలుపు స్థానమువంట యిల్లు (వీరి మతమున ప్రత్యక్షమైనది లేదుగాన వంట యిల్లును లేదుగనుక) స్థానము లేకపోవుటచేత ప్రత్యక్షమగు పొగనుబట్టి నిప్పు ఉండు అనుమానము ప్రవృత్తి ఉపపన్నము కాదు. ఇట సకలలోకానుభవ విరోధము ఉన్నది కూడ.

సౌత్రాంతిక మతాదల్పభేదో వైభాషికే మతే
ప్రత్యక్షత్వం తు బాహ్యస్య క్వచిదేవాను మేయతా

"వైభాషికమతమునకు సౌత్రాంతికమతమునకుఁగల భేదము స్వల్పమె. బాహ్యము ప్రత్యక్షము కొన్నిచోట్లనే అనుమేయము. ముందువెనుకలనగు పడిన పరమాణువులలో స్థూలత్వముకలుగుచున్నది.

దూరాదేవవనంపశ్యన్ గత్వా తస్యాంతికంపునః
నవనంపశ్యతి క్వాపి వల్లీవృక్షా తిరేకతః (శ.)

దూరమునుండి వనమునుచూచి దగ్గరకుపోయి తీగలుపొదలచెట్లు కంటె వేఱుగా వనమును జూడము.

మృదోఘటత్వమాయాతి కపాలత్వంతుతేఘటాః
కపాలానిచ చూర్ణత్వంతతోనః పరమాణుతం.

మట్టి ఘటమగును ఘటము కపాలములగును. కపాలములు చూర్ణ మగును. చూర్ణము పరమాణువులగును.

చతుర్ణామపి బౌద్ధానామైక్యా దధ్యాత్మనిర్ణయే
వ్యావహారికభేదేన వివదంతే పరస్పరం.

అధ్యాత్మ నిర్ణయములో నల్వురుబౌద్ధులు ఒకటె వ్యావహారిక భేదము చేత పరస్పరము వివదించుచున్నారు." అని శంకరులు.

ఇంక అర్థము గ్రాహ్యము అధ్యవసేయము అని రెండువిధములు. ఇంద్రియసంయోగానంతరము వెంటనే ఇదిఏదోకొంత అనినిర్వికల్పక జ్ఞాన మందు విషయమైన దేవదత్తాది రూపమైన యర్థము గ్రహింపదగియుండుటచే గ్రాహ్యమనబడును. అదేపిదప జాత్యాది విశిష్టముగా వీడు బ్రాహ్మణుడు వీడు నల్లనివాడు వీడువంటవాడు వీడు గిత్తుడు అని సవికల్పక జ్ఞానమునందు విషయమైనది అధ్యవసేయమనఁబడును. నిర్వికల్పక జ్ఞానము గ్రాహ్యము సవి కల్పకజ్ఞానము అధ్యవసాయము. అందు నిర్వికల్పకరూపమైన గ్రాహ్యము కల్పనలులేనిదికాన ప్రమాణము. కల్పనాజ్ఞానముండుటవలన సవికల్పకరూప

మైన అధ్యవసాయము అప్రమాణము కల్పితరజత్వ విశిష్టము నప్రమాణము కాదు. అట్లే జాత్యాదులు కల్పితములు కాన జాతివిశిష్టమైన జ్ఞానము ప్రమాణముకాదు. అసత్యములో కల్పితత్వమే ప్రధానమని బౌద్ధులు. అందు డిత్థాది సంజ్ఞలు వస్తుతంత్రములు కావు, పురుషతంత్రములుకాన కల్పితములే అని అందఱు అంగీకరించినదే అదియునిట్లు చెప్పఁబడినది.

"కల్పనా పోఢమభ్రాంతం ప్రత్యక్షం నిర్వికల్పకం
వికల్పోవస్తునిర్భాసా దసంవాదాదుపప్లవః"

కల్పనలులేని, వికల్పములేని ప్రత్యక్షము భ్రాంతిలేనిది ప్రమాణము సవికల్పక జ్ఞానము వస్తువు ఒకమాఱుఅట్లు ఒకమారిట్లు ప్రకాశించుటవలన అందఱకు ఒకేవిధముగా జ్ఞానములేకపోవుటవల్ల అప్రమాణము" అని

గ్రాహ్యం వస్తుప్రమాణం హి-గ్రహణం, యదితోన్యథా
నతద్వస్తు, సతన్మానం శబ్దలింగేంద్రియాదిజం"

గ్రహింపఁదగిన వస్తువు (నిర్వికల్పక విషయమైనది) గ్రహణమగనక (నిర్వికల్పకజ్ఞానముకనుక) ప్రమాణము నింతకంటె నితరమైనను వికల్పక జ్ఞానము అదివస్తువు (ప్రమాణము) కాదు. శబ్దమువల్లసిద్ధించినది శాబ్దము లింగమువల్ల సిద్ధించిన యుపమానము ఇంద్రియజన్యము సవికల్పకజ్ఞానము ఇంకను ఉపమాదులవలన సిద్ధించిన జ్ఞానముప్రమాణముకాదు. అనియును

సరే అయితే సవికల్పకజ్ఞానము ప్రమాణముకానిచో ఎట్లుదానివల్ల ప్రవర్తించినవానికి శుక్తియందు భ్రమచే రజతప్రాప్తియును, సత్యరజత స్థలమందు రజతప్రాప్తియును, సంవాదము (=అందఱకు ఒకేభావము) ఉప పన్నమగునన్నచో — మణికాంతి యందిది మణియని భ్రమము పిదప మణి కాంతిద్వారా మణిప్రాప్తి కలుగుట్లు సత్యరజతస్థలమున ఇదిరజతమని అను సవికల్పక భ్రమకలిగి ఆ భ్రమద్వారానే సత్యవస్తు ప్రాప్తికలుగును. అట్లే పరంపరగా అర్థప్రాప్తి సంభవించుచున్నది కనుక అట్లనుట భద్రముకాదు. మిగిలినది సౌత్రాంతిక ప్రస్తావములో విస్తరించి చెప్పఁబడినది కాన ఇట విస్త

రింపఁబడుటలేదు. శిష్యులనుబట్టి యుపదేశము వేఱువేఱుగా నుండును. కాన అది సాంప్రదాయికము కాదని యనరాదు అది బోధిచిత్త వివరణమున చెప్పఁబడినది—

దేశనాలోకనాథానాం సత్త్వాశయ వశానుగాః
భిద్యంతే బహుధాలోక ఉపాయైర్బహుభిఃపునః

గంభీరోత్తాన భేదేనకచ్చిచ్చోభయలక్షణా

భిన్నా హిదేశ నాభిన్నా శూన్యతాద్వయలక్షణా "అని లోకనాథుల యుపదేశములు ప్రాణుల యాశయములను బట్టి యుండును అనేకోపాయములచే మరలలోకము ననేకములుగా భేదించుచుండును. ఉత్తమ మధ్యమాధమాధికారి భేదములనుబట్టి ఒకప్పుడు గూఢార్థములై యొకప్పుడవే స్పష్టములై యొకప్పుడు రెండువిధములుగ భిన్నమైయుండును. అద్వయలక్షణముగల శూన్యత్వమైతే అభిన్నమైన తత్త్వము. అందు భేదములేదు." అని హీనబుద్ధులు ఒక్కమాటుగా శూన్యతాతత్త్వమును తెలిసికొనలేరుగాన వారు సర్వాస్తిత్వవాదముచే వారియాశయమునుసరించి శూన్యతయందె చివరకు దిగుచున్నారు. మధ్యమబుద్ధులు జ్ఞానముమాత్రమె ఉన్నదని చివరకు శూన్యతయందె దిగుచున్నారు. ప్రకృష్టమైన బుద్ధిగలవారు సాక్షత్తుగా శూన్యమే తత్త్వమని గ్రహించుచున్నారని గ్రహింపవలయును.

శ్రోత్రముత్వక్కు నేత్రము జిహ్వ ఘ్రాణము అని ప్రత్యయములైదు. వాక్కుపాదపాణి పాయ్వాదులైన జ్ఞేయములు కారకపంచకము. పరమాణువుల సాముదాయిక చైతన్యమె బుద్ధి కరణముమనస్సు నామజాతి గుణద్రవ్య క్రియారూపముగా అది యయిదు విధములుగాఁ గల్పితము. అదిభ్రాంతిచే శరీరభువనరూపమైనది. బౌద్ధశాస్త్రములో ప్రత్యక్షానుమానములు రెండుప్రమాణములు. నాలుగువిధములైన యజ్ఞానములు ఈ రెండు ప్రమాణములచేత నివర్తించును. మూలాజ్ఞానము నివర్తిల్లగా విశుద్ధజ్ఞాన ప్రవాహముకలుగును. ఈ శుద్ధబుద్ధియె మోక్షము.

శ్రుతిస్మృతి పరులైన ఈ వైశేషికాదులు అంగీకరించిన ఈశ్వరునిమే మంగీకరింపము. హేయోపాదేయతత్త్వమును మోక్షపాయమును తెలిసిన వాడే మాకుప్రమాణము. నీవుచెప్పిన సర్వజ్ఞుఁడు మాకు ప్రమాణముకాదు" అని శంకరులు.

ద్వాదశాయతన పూజ శ్రేయస్కరమని బౌద్ధ నయమందు చెప్పఁబడినది.

"ఎక్కువ పదార్థములను సంపాదించి ద్వాదశాయతనములు పూజింపఁ దగినవి. మిగిలినవి పూజించినచో ప్రయోజనమేమి. జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు. మనస్సు బుద్ధి అని ఆయతనములు పన్నెండు" అని

వివేకవిలాసములో బౌద్ధమతము ఈ క్రింది విధముగా చెప్పఁబడినది.

"బౌద్ధులకు సుగతుఁడు దేవుఁడు. విశ్వము క్షణభంగురము ఆర్యసత్యములని తత్త్వములు నాలుగు. 1. దుఃఖము 2. ఆయతనము 3. సముదయము 4. మార్గము అని.

దుఃఖము :- సంసారమును పొందు స్కంధములు అయిదు.
1. విజ్ఞానము 2. వేదన. 3. సంజ్ఞ. 4. సంస్కారము. 5. రూపము. అని
ఆయతనములు :- పంచేంద్రియములు, శబ్దాదివిషయములైదు. మనస్సు ధర్మము అని పన్నెండు.

సముదయములు :- ఆత్మాత్మీయ స్వభావమనుపేరుగల రాగాదిగుణము.
మార్గము :- సర్వసంస్కారములు క్షణికములు అను స్థిరమైన వాసనతెలిసి కొనవలెను అదిమోక్షము.

ప్రత్యక్షము అనుమానము అని ప్రమాణములు రెండు.

వైభాషికులు మొదలగువారివి నాలుగు ప్రస్థానములు. జ్ఞానసహితమైన అర్థమును వైభాషికులు అధికముగా తలతురు. సౌత్రాంత్రికులు ప్రత్యక్ష

గ్రాహ్యమైన యర్థము బాహ్యముకాదని తలతురు. బుద్ధి ఆకారసహితముగా నుండునని యోగాచారులు. కేవలసంవిత్తే స్వస్థమైయుండునని మాధ్యమికులు రాగాది సంతానవాసనను ఉచ్ఛేదించుటచే గలిగినదే ముక్తి అని బౌద్ధులు నలుగురు తలతురు.

బౌద్ధభిక్షువులు చర్మమును కమండలువును శిరోముండనమునుచీరమును పూర్వాహ్ణ భోజనమును సంఘమును ఎఱ్ఱని కాషాయవస్త్రమును ఆశ్రయింతురు.

(ది. ది. 8. 265. 275)

గురువగు బుద్ధుడు నిర్యాణ పొందిన పిదప క్రీ॥పూర్వం 246–247 అశోకుడు ।కీ పూ॥144 కాశ్మీరరాజు కనిష్కుడు సభలుచేయుచుబుద్ధుని ఉపదేశములను గ్రంధస్థముచేసిరి వీనిని త్రిపిటకములందురు, సూత్రపిటకము వినయపిటకము 3 అభిధమ్మపిటకము లనువీనిలో గాథలు జాతకకథలు ఇతివృత్తములు ధర్మములు మొదలగునవియును కలవు

బుద్ధుడు మొదట సర్వముశూన్యము అని యుపదేశింపగా ఇట్లైనచో జగత్తు అంధకారమయమగును కాన సర్వముశూన్యమనుట అసంభవము. పోనీ అట్లేకానిమ్ము జ్ఞానము మాత్రము ఉండునని స్వీకరింతము. బాహ్యార్థము లేనపుడు జ్ఞానము మాత్రము ఎక్కడ ఉండును. కనుక బాహ్యార్థముస్వీకరింపబడెను. ఇట్లు ఎంతవరకు సూత్రమునకు అంతు ఉండునని అడిగినవారు సౌత్రాంతికులనబడిరి. సూత్రాంతమును అడుగువారు సౌత్రాంతికులని వ్యుత్పత్తి కుమారలాతుడు (650 క్రీ శ.) సౌత్రాంతిక మతస్థాపకుడు కల్పనా మండితికా కర్త. శ్రీలాతుడు కుమారలాతుని శిష్యుడు ఇతడు విభాషా శాస్త్రకర్త.

వసుమిత్రుడు సమయభేద ఉపరిచన చక్రకర్త. యశోమిత్రుడు స్ఫుటార్థ వృత్తికర్త.

ఇది

సాయణమాధవ శంకరాది రచితమై శ్రీవెంకమాంబా
నారాయణ శాస్త్రుల పుత్రుడగు చర్ల గణపతిశాస్త్రిచే
తెనిగింపఁబడిన సర్వదర్శనసంగ్రహమున
బౌద్ధదర్శనము,

## మహావీర చరిత్ర

హిందూమతము పిదప జైనమతము భారతవర్షములో ప్రాచీనమైనది భారతవర్షమున మొదటినుండియు ఉన్న మతమును వేదమతమనిగాని, ఆర్ష మతమనిగాని యనుట న్యాయము. హిందూమతమనునది సింధునదినిబట్టి సింధుప్రాంత మతముగా విదేశీయులు పెట్టిన పేరయి యుండును. "సింధు" పదముచ్చారణములో హిందుగా మారినది. జైన మతమును ప్రచారము లోనికిఁ దెచ్చినవాఁడు మహావీరుఁడే యయినను "దీనికి మొదటి ప్రవక్త ఋషభుఁడు" అని జైనులందురు. ఋషభుఁడు మరుదేవికిని నాభిరాజునకును అయోధ్యలోఁ జైత్రమాస కృష్ణనవమినాఁడు ఉత్తరాషాఢా నక్షత్రమున పుట్టెను. జైనమత ప్రవక్తలను తీర్థంకరులందురు. ఋషభుని కుమారులలో పెద్ద వాఁడయిన భరతుఁడు పాలించుటచేతనే యీ దేశము భారతవర్షమనఁబడెను. అని భాగవతము చెప్పుచున్నది. ఋషభుఁడు రాజ్యము పాలించుచు ప్రజల జీవికకై అసి (=కత్తి) మషి (=సిరా) కృషి (=వ్యవసాయము వాణిజ్య శిల్పములు) అను వృత్తుల నేర్పరచెను. అసిజీవులు క్షత్రియులు, మషి జీవులు బ్రాహ్మణులు, కృషివాణిజ్యాది జీవులు వైశ్యులు. వీరు ముగ్గురిని సేవించువారు శూద్రులు. ప్రతివారు జీవికకై తమతమ వృత్తులనే గాని యితర వృత్తులను అవలంబింపరాదని ఋషభుఁడు శాసించెను.

ఒకనాడు ఒక నర్తకి తన సభలో నాట్యము చేయుచు అక్కడనే పడి చనిపోవుట తటస్థించెను. అది చూచిన ఋషభునికి విరక్తి జనించెను. అంతట రాజ్యమును భరతుని కప్పగించి జినదీక్ష పూని కైలాసపర్వతము దగ్గఱ మౌనముగ తపస్సు చేసెను. అక్కడనే పిదప సిద్ధిపొంది మాఘకృష్ణ చతుర్దశినాఁడు నిర్యాణము పొందెను. ఈ ఋషభుఁడు పరమేశ్వరుని యవ తారమని భాగవతములో జెప్పఁబడెను. "ఋషభుఁడు రాజ్యమును భరతుని కప్పగించి తన యాత్మను పరమేశ్వరునియందు లయింపఁజేసెను. అతడు తన శరీరము తీసికొనిపోయినట్లు గ్రామములవెంబడి పోవుచుండెను. కుమ్మరి సారెను దండముతో త్రిప్పి వదలగా ఆ వేగమున్నంతవఱకు ఆ సారె తిరుగు చున్నట్లు అదివఱకు ఆత్మచేఁ ద్రిప్పఁబడిన యా శరీరము ఆ వేగమున్నంత

**పశ్చిమద్వారము—** సుషుమ్నానాడి.

**పశ్చిమద్వారలక్షణము—** సుషుమ్న చేత వాయువును పూరించి కుంభించుట.

**పశ్చిమలింగము—** ప్రత్యక్చైతన్యము.

**పశ్యంతీవాక్కు—** సంకల్పము. పాము యొక్క చూపునకు, వినికికి కన్నే హేతువైనట్లు సమస్త వస్తుగ్రాహ్యయోగ్యమై మహత్తత్త్వసంజ్ఞగల యా బ్రహ్మప్రణవమందలి మకారమానందాత్మకప్రథమస్ఫురణ.

**పాకయజ్ఞములు—** అష్టకయజ్ఞము, పార్వణము, శ్రాద్ధము, శ్రావణి, అగ్రహాయణి, చైత్రి, అశ్వయుజ్ఞము.

**పాద్యము—** పాదప్రక్షాళన కొరకైన జలము.

**పాపత్రియము—** అంహఃపాపము. అఘపాపము, ఏనస్సుపాపము.

**పాయువు—** గుదము.

**పారమార్థికజీవుఁడు—** పారమార్థికస్వత్తమగు పరబ్రహ్మముతో సంబంధపడిన జీవుఁడు.

**పారాశరి—** వ్యాసప్రోక్త బ్రహ్మసూత్రముల నధ్యయనము సేయు సన్న్యాసి.

**పారికాంక్షి—** తపస్సుఁగలవాఁడు.

**పారిప్లవము—** అశ్వమేధయాగమునందు భార్యాపుత్రాది సమన్వితుఁడై కూర్చుండియున్న ప్రభువునకు, వినోదార్థమై చెప్పఁబడవలయునని వేదమునఁజెప్పబడిన విధి.

**పారిమాండల్య పరిమాణము—** పొడవు, వెడల్పు లేక ఒకప్రదేశము మాత్రము నాక్రమించి యుండుట. అతిసూక్ష్మము.

**పార్థివము—** కాష్ఠపాషాణములందుండు నగ్ని. (కాష్ఠపాషాణజోవహ్నిః పార్థివోగ్రహణీగతః)

**పారాశరి—సన్న్యాసి—** పరాశరపుత్రుఁడగు వ్యాసభగవానునిచే రచింపఁబడిన బ్రహ్మసూత్రములఁ బఠించువాఁడు.

**పార్శ్వపాదాసనము—** మిట్టపల్లములులేనిసమానమైన భూమియందుఁ బరుండి రెండుచేతులను రెండు ప్రక్కలయందలి వీపునఁజేర్చి యొక చేతిని మరియొకచేతితోఁజక్కగాఁ బట్టుకొని యుండుపద్ధతి.

**పాశుపతమతము—** వేదములను ప్రమాణములుగఁగైకొనక నాగమములను మాత్రము ప్రమాణముగఁ గైకొనిన పాశుపత, మహావ్రత, కాపాలములను అతిమార్గిక మతత్రయములలోనొకటి. ఈ మతము మాయాతత్త్వస్థ రుద్రప్రోక్తమని చెప్పఁబడినది. దీనిసిద్ధాంతమునఁ బ్రాణులనేకులనియు, జ్ఞానమునందును చైతన్యమునందును నొండొంటతోఁగలియక ప్రత్యేకముగ నుందురనియు, సకులీశుఁడు ప్రవర్తకుఁడుగఁజెప్పఁబడిన మతము.

**పాంక్తనము—** పంచసంఖ్యాయోగము (పంచాక్షరాపంక్తిః పాంక్తోయజ్ఞః)

**పితృపంచకము—** తన్నుగన్నవాఁడు. తనకు వడుగుఁజేసినవాఁడు, చదువుఁ జెప్పినవాఁడు, విపత్తునందు అన్నముఁ బెట్టికాపాడినవాఁడు, ఆపదయందు భయముఁదీర్చి రక్షించినవాఁడు.

"వర్ధమానుఁడు తన తల్లి కోరికపైని యశోదయను నామెను వివాహమాడి యామెయందు అత్యంతానురాగుఁడై యుండగా ప్రియదర్శన అను కుమార్తె కలిగినట్లును ఆమెను జామాలి యను నతఁడు పెండ్లియాడినట్లును శ్వేతాంబర జైనులు చెప్పెదరు.

వర్ధమానునికి ఇరువది వత్సరముల వయస్సులో అతని తల్లిదండ్రులు చనిపోయిరి. వర్ధమానునికి నందివర్ధనుఁడను సోదరుఁడు గలడు. వర్ధమానుడు రాజ్యమును పాలింప నిష్టపడకపోవుటచే మంత్రులు నందివర్ధనునకు బట్టము గట్టి సింహాసనముపై గూర్చుండబెట్టిరి. తమ్ముని కోరికపైని వర్ధమానుడు ముప్పదేండ్లు వచ్చువఱకు ఇంటియందె యుండి పిదప క్రీ. పూ. 569 మార్గశిర కృష్ణదశమీనాడు సంన్యాసదీక్షను స్వీకరించెను. అతడు దీక్ష గ్రహించిన పిదప 12 సంవత్సరములు నిర్వాణజ్ఞానము బొందువఱకు మౌనము వహించి యుండెను. వర్ధమానుఁడు దీక్ష గ్రహించిన కాలములో అనేక పరీక్షలకు గురి యయ్యెను.

ఒకమారు వర్ధమానుఁడు శ్వేతాంబిరియై నగరివైపుగాబోవుచుండెను. అప్పుడు "ఈదారిలో నొక గొప్ప క్రూరసర్పము గలదు. ఆ వైపుగా బోవరాదు." అని యొక గొల్లవాడు చెప్పెను. కాని వర్ధమానుడు మౌనియై బోవుచుండెను. అంతలో ఆ సర్పము వర్ధమానునికి ఎదురయ్యెను. మనుష్యుని జూచుటలో అది చట్టున పడగవిప్పెను. ఎదుట అంత పెద్ద సర్పమును జూచినను వర్ధమానుని ముఖములో వికారముగలుగలేదు. ముఖము ప్రసన్నముగనే యుండెను. అతని ప్రసన్న ముఖమును జూడగనే ఆ పాముయొక్క క్రౌర్యము పటాపంచలయ్యెను. అది తిన్నగా తనదారినె శాంతముగా వెడలిపోయెను. వర్ధమానుడు తన ప్రయాణమును ముందుకు సాగించెను. అది చూచి యక్కడి పశువుల కాపరులు ఆశ్చర్యపడిరి. నాటినుండి ఆ పాము ఎవరిజోలికిని బోయిన జాడ గనిపింపలేదు.

ఒకసారి వర్ధమానుడు గంగానదిని దాటుటకై యితరులతో పాటు నావ నెక్కి పోవుచుండెను. ఆ నావ నడిమధ్యకు వెళ్ళునప్పటికి గొప్ప తుఫాను

**పూర్వతానాసనము**— కాలి వ్రేళ్ళను మడిచి భూమిపైనుంచి మడిమెలను పిరుందులయందుఁజేర్చి శిరస్సును చేతులతోడను, నడుమును మోచేతుల తోడను. అదిమి పట్టుకొని నడుమును నిక్కియుంచుట.

**పూర్వమీమాంస**— మీమాంసయనఁగా విచారము లేక విమర్శనమనియర్థము. ఇదిషడ్దర్శనములలో నొకటి. దీనికి కర్మమీమాంసయని పేరుగలదు. దీనిలో వైదికకర్మలయొక్క స్వభావమును, వేదవాక్యములకు అర్థము చేయవలసిన విధమును, విచారింపఁబడినది. జైమిని విరచితసూత్రములు ప్రమాణములు. ఈ పూర్వమీమాంస యొక్క రెండవభాగమునకు ఉత్తర మీమాంసయని లేక బ్రహ్మసూత్రము లనిపేరు, మొదటిభాగమున కర్మ మీమాంసఁజేయఁబడినట్లే అందు బ్రహ్మవిచారముఁజేయఁబడినది. దీనిని వేదాంతమని పలుకుదురు. వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములు ప్రమాణములు. కర్మ మీమాంసికులు విహితమైన కర్మలవలననే స్వర్గాదిఫలములు కలుగుననియందురు. వేరుగా నీశ్వరునంగికరింపరు.

**పూర్వాఘము**— భగవత్సమాశ్రయణాత్పూర్వము అనాదికాలార్జితమగు చేతనకృతకర్మము.

**పృథ్వీ**— శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది పంచగుణ సమన్వితమగు భూమి. మహత్పంచ భూతములలో నొకటి. లక్షణముగంధము. సంబంధాక్షరములు ఉ,ఊ,ఓ,గ,జ,థ,ద,ఖ,లహ,లు. జ్ఞానేంద్రియము ఘ్రాణము. కర్మేంద్రియము పాయువు. గుణము విసర్గము. వాయువు అపానము. ఉప వాయువు కూర్మము.

**పృథ్వీబీజము**— లం అనునక్షరము.

**పృషదాజ్యము**— పెరుగు తోఁగలపఁబడిన నేయి.

**పెరియసంబంధులు**— వైష్ణవ మతమును స్వీకరించిన షష్టములు అనగా మాదిగలు.

**పైత్రము లేక పితృతీర్థము**— పెనువ్రేలు జుట్టిన వ్రేళ్ళయొక్క మధ్య నుండి విడచెడు పితృసంబంధ మగు తీర్థము.

**పోత** – యజ్ఞములందు బ్రహ్మకు సహాయముఁజేయు ఋత్విక్కు.

**పౌరుషేయము** – మొట్టమొదట తాఁ జెప్పవలసిన యర్థమునొకదానిని సేకరించి తదనుసారముగ పదములను గూర్చి గ్రంథమును రచియించెనేని దానిని పౌరుషేయమందురు.

**పంచకృత్యములు** – సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహములు. వీనికి కర్త పరమేశ్వరుఁడు.

**పంచకేదారక్షేత్రములు** – (1) బదరీకేదారము లేక కేదారనాథము. (2) మధ్యమేశ్వరము. (3) తుంగనాథము (4) రుద్రనాథము (5) కల్పేశ్వరము.

**పంచక్లేశములు** – (1) అవిద్యాక్లేశము. నేను జీవుఁడనని నిర్ణయించుకొనుట.

(2) అభినవక్లేశము, సంసారమును దానికి కారణమైనమనస్సును పరిత్యజించకుండుట.

(3) అస్థిగతక్లేశము, విషయాభిలాషఁ గలిగి విజ్ఞవీగుచుండుట.

(4) రాగక్లేశము. అర్థములయం దధికానురక్తిఁ గలిగియుండుట.

(5) ద్వేషక్లేశము. ఉదరపోషణార్థము పరులనాశ్రయించి వారివలన తన యభిమతము కొనసాగనందున వారల దూషించుట.

**పంచకోశములు** – అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు.

**పంచగవ్యములు** – గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము.

**పంచగంగలు** – భాగీరథీ. యమున, కృష్ణ, గోదావరి, కావేరి.

**పంచజనులు** – ఐదుతెగలుగా నుండు మానవులు. భారతీయులలోఁ బ్రధానులగు నధిక సంఖ్యాకులు ఋగ్వేదమునందధికముగ నుచ్చరింపఁబడిన "పంచజనాః" అనుశబ్దముచే నైదు వర్గములం జెప్పబడియుండును. మంత్రద్వయమున పౌరవులు, తుర్వసులు, యాదవులు, అనువులు, ద్రుహ్యులు అనునైదు వర్గములఁ బేర్కొనియున్నారు. పంచభూతములచే సృష్టియైనవారు.

**పంచతన్మాత్రలు**– శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

**పంచదశ యోగాంగములు** –
యోగాంగములు 8 త్యాగము 1 మౌనము 1 దేశాచారవర్తనము 1 కాలానుగుణ్యవర్తనము 1 మూలబంధము 1 దేహసామ్యము 1 దుఃఖరహితము 1 అంతుపదునైదంగములు.

**పంచదేవతలు** – పంచేద్రియాభిమానులగు దిక్పాలురు: వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వనీదేవతలు.

**పంచదైవతములు** – బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు.

**పంచద్వారకలు** – గోమతీద్వారక, బేటీద్వారక, కాకతీద్వారక, శ్రీనాథద్వారక, మోక్షద్వారక.

**పంచధర్మములు** – జాతిధర్మము, ఆశ్రమధర్మము, మతధర్మము, దేశధర్మము, గుణధర్మము.

**పంచనారాయణోపనిషత్తులు** –
నారాయణోపనిషత్తు, బ్రహ్మోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు. గార్గోపనిషత్తు, వారాహోపనిషత్తు, వీనియందు నారాయణ రూపము వివరింపబఁడియున్నది.

**పంచపర్వములు** – కృష్ణపక్షాష్టమి, కృష్ణపక్ష చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, మాసనంక్రాంతి.

**పంచప్రయాగలు**– ప్రయాగ యనినంతనే అల్లాహాబాదువద్ద గంగా, యమున, సరస్వతీనదుల కలయిక యగు త్రివేణీ సంగమమే తలంపునకు వచ్చును. ఇవిగాక హిమాద్రియందుఁ బాఱుచుండు నదు లొండొంటితోఁ గలియుచోట్లనును ప్రయాగయని

ఇట్టి మహావీరుని యహింసా మార్గమె నేడు దేశములో స్మరింపదగి అవశ్యాచరణీయమై యున్నది. నేటి కల్లోలపరిస్థితిలో మహావీరుడు చూపిన మార్గమొకటియె శరణ్యము. నేటి యణుయుగము ఈ మహావీరుని యహింసా మార్గమును అవలంబించి శాంతిని పొందుగాక!

ఆర్హత (జైన) మతము

బౌద్ధులు సర్వము క్షణికమనిరి. దానిని సహింపక దానికి ఏదో విధముగ స్థాయిత్వమును స్థిరపఱచి ఆర్హతులు క్షణికత్వపక్షమును ఖండించిరి. ఆత్మస్థాయిగా నుండదన్నచో ఐహిక పారలౌకిక ఫలములకు సాధనములను సంపాదించుట వ్యర్థమగు వలసివచ్చును. ఒకడు చేయుట యింకొకడు దాని ఫలమును అనుభవించుట సంభవింపదుగదా. కనుక పూర్వకాలములో కర్మ చేసితిని దానినిపుడు అనుభవింతును. పూర్వకాలమును తరువాతి కాలమును అనుసరించి స్థాయియైన యాత్మస్పష్టమైన ప్రమాణముచేత నిశ్చయింపబడుటచేత పూర్వభాగము పరభాగము అవి లేనికాలపు సూక్ష్మాంశల యవస్థితి లేకపోవుటయె లక్షణముగాఁగల క్షణికత్వ పక్షమును సత్యపరీక్షకులైన యార్హతులు స్వీకరింపరాదు.

ఒకవేళ– "ప్రమాణము కలిగియుండుటవల్ల సిద్ధమైనపుడు ప్రవాహము ఎవనిచే వారింపఁబడును." అను న్యాయముచే (అయోగ్య) ముగా భాసించుచున్నను (ప్రమాణసిద్ధమైనచో తప్పక స్వీకరింపవలసినదే) "ఏదిసత్తో అది క్షణికము." ఇత్యాది ప్రమాణముచే క్షణికత్వము ప్రమాణసిద్ధమగుటచే దానిని ఒట్టి (అనుమానసిద్ధమైన క్షణికత్వము అనుభవములో లేనప్పటికి విడవరానిది) సమానభావ ప్రవాహమునందున్న మొదటి క్షణిక జ్ఞానముగాను కర్మ కర్త ఉత్తర క్షణికజ్ఞానము ఫల భోక్తగాను అగుచున్నది. ఇట్లు పూర్వ క్షణిక జ్ఞానరూపమైన యన్యమైన యాత్మచేసిన కర్మకు ఫలమును ఉత్తర క్షణిక జ్ఞానరూపమైన యింకొక యాత్మ అనుభవించుచున్నచో ఇతర భావప్రవాహమందున్న ఆత్మకూడ అనుభవింపవలసివచ్చునే అటువంటప్పుడు దేవదత్తుడు చేసిన కర్మ ఫలమును యజ్ఞదత్తుడు కూడ అనుభవింపవలసి వచ్చును గదా

అన్నచో కార్యకారణభావము నియామకమగుటవలన ఒకే భావప్రవాహములో నున్న ఆయా పూర్వక్షణిక పదార్థమునకు అన్యనోత్తర క్షణిక పదార్థమును గురించి కారణత్వమె యుండును. కనుక దేవదత్తునికి సంబంధించిన భావ ప్రవాహములోనున్న జ్ఞానరూపాత్మకును కార్యకారణ భావము లేకపోవుటచే పైని చెప్పిన యతి ప్రసంగము (దోషము) లేదు. ఎట్లన—మధురరసముచే భావన చేయఁబడిన మామిడిటెంకలు భూమిలో పాతినపుడు అంకురకాండ స్కంధశాఖాపల్లవాదులందు వానిద్వారా పరంపరగా ఫలమందు మాధుర్యము నియమముగా వచ్చుచున్నది. లత్తుకరసములో నానఁబెట్టిన దూది విత్తన ములకు అంకురాది పరంపరగా పండి దూదియందు ఎఱుపు నియమముగా వచ్చుచున్నది కూడ. ఇదియు పూర్వులచే చెప్పఁబడినది.—

యస్మిన్నేవహి సంతానే ఆహితాకర్మవాసనా
ఫలంతత్రైవ బధ్నాతి కార్పాసేరక్తతాయథా
కుసుమేబీజ పూరాదౌ యల్లాక్షద్యవసిచ్యతే
శక్తిరాధియతే తత్రకాచి, త్తాంకింనపశ్యసి"

"ఏభావ సంతాన మందైతే కర్మవాసన కలిగియున్నదో అక్కడే దూదియందు ఎఱుపువలె అది కలుగును. బీజాపూరాదులకు లత్తుకరసముతో తడిపినపుడు అక్కడ పువ్వునందుబకానొక శక్తి కలుగుచున్నది. దానిని నీవు చూడవేమి?" అని తలతువేని—

అదికూడతెల్లునుదర్భను పట్టుకొనినదిని దాటుటవంటిదె అగును. వికల్ప ములను సహింపదు కనుక. ఎట్లన ఇక్కడమామిడిటెంక దూదిగింజల యుదా హరణములు సరియైనవికావు. అక్కడకారణములైన బీజాదులలో ఉన్నమా ధుర్యము కాని ఎఱుపుగాని పరంపరగా కార్యములో సంక్రమించుట లేదు. మధురములు ఎఱ్ఱనివియగు బీజాద్యంశములే కార్యమునందు సంక్రమించు చున్నవి. కారణము కార్యమందన్వయించును. అట్లేఅంకురాది కార్యములందు సంక్రమించు బీజాదులలో నున్నఅంశములె." అంకురాదులకు కారణములగు చున్నవి కాని పూర్వబీజములెకావు బీజము అంకురాదులకు కారణమను వ్యవ హారము లాక్షణికము. ఇట్లు ఒకచోట పుట్టిన ఫలమును ఇంకొకచోట కనిపించు చున్నదనుటకు దృష్టాంతమేదియులేదు.

మబ్బు మొదలగు దృష్టాంతరములందుగల క్షణికత్వము ఈయనుమాన ప్రమాణముచే ప్రయాయుక్తమా లేక ప్రత్యక్షప్రమాణముచేతనా? మొదటిది కాదు. నీక్షిష్టమైన క్షణికత్వము ఇదివఱలో ఎక్కడను కవిపింపకపోవుటచేత దృష్టాంతము సిద్ధింపకపోగా అనుమానమె బైలుదేఱదు. కనుక ఇంక రెండవ పక్షమును సరికాదు, ఆయనుమానముచేతనె అన్నిచోట్ల క్షణికత్వము సిద్ధించుచుండ సత్త్వానుమానమె వైఫల్యము పొందవలసివచ్చును. కనుక అర్థక్రియలను చేయుటె సత్త్వము అని యంగీకరించినపుడు మిథ్యయైన సర్పాదిదంశాదులుకూడ అర్థక్రియలను చేయుచుండుటచే సత్త్వము కావలసివచ్చును, కనుకనె సృష్టిస్థితిలయములలోఁ గూడి ది సత్తని చెప్పఁబడినది. సామర్థ్యాసామర్థ్యరూపవిరుద్ధ ధర్మములను సత్త్వమందు అధ్యాసచేయుటవల్ల సత్త్వము సిద్ధించువని యన్నచో అది సాధువుకాదు. గాదెలోనున్న గింజ నేలలో పాతిన గింజ ఒకటేయున్నచో అంకురముగాఁ బుట్టించుటకు దానిలో సామర్థ్యమున్నదా లేదా ఉన్నదన్నచో గాదెలోనిగింజవల్లకూడ అంకురము ఉత్పన్నము కావలసివచ్చును పోనీ లేదన్నచో నేలలో పాతినగింజవల్ల అంకురము ఉత్పన్నము కాకపోవలయును. సామర్థ్యముండుట లేకుండుట అని విరుద్ధ ధర్మములను అంగీకరింపరాదు. కనుక తప్పనిసరిగా బౌద్ధధర్మమందు సత్త్వమందు క్షణికత్వము అంగీకరింపఁబడినదని గ్రహింపవలయును. స్యాద్వాదులైన జైనులు అనేకాంతవాదమును (అనిశ్చయవాదమును) అంగీకరింతురు కాన విరోధములేదు.

ఘటమున్నది అని సాంఖ్యాదులనఁగా (స్యాదస్తి) ఉండవచ్చును అని జైనులన్నారు. ఘటములేదని మాధ్యమికులనఁగా లేకపోవచ్చును (స్యాన్నాస్తి) అనియందురు. సరే ఘటమున్నది అంటె ఎఱ్ఱకుండ ఉన్నపుడు తెల్లకుండ లేదు చిన్నకుండ ఉన్నది అంటె పెద్దకుండ లేదు ఒకకుండ ఉన్నది అంటే రెండుకుండలులేవు అని ప్రయోగములుకలవు. అక్కడ ఘటమునందు ఎఱుపులేదు మహత్త్వములేదు ద్విత్వములేదనియె ప్రయోగింపవలెను, మఱి కుండ ఉన్నదనఁగా లేదనుట యెట్లు కనుక రెండురకములు ప్రయోగములను కుదుర్చుటకు ఘటాదులందు అస్తిత్వము రెండు ఒకమాటే ఉన్నవని

స్థిరపరచుకొనవలెను. కనుక సామర్థ్యా సామర్థములు కూడ ఒకచోట ఉండు టలో విరోధములేదు. కనుక బీజాదులకు క్షణికత్వము సిద్ధింపదని భావము.

ఇదివరలోఁ జెప్పఁబడిన దూదిమొదలగునవి దృష్టాంతములుగా చెప్పుట అది మాటకుమాత్రమె వీలయిన పొగనుబట్టి నిప్పును సాధించునట్టియుక్తి. దూది మొదలగుచోటకూడ నిరన్వయనాశమును అంగీకరింపక పోవుటలేదు కనుక–దూది మొదలగువానియందు లేదు. నాశమున్నది అన్నిచోట్ల సాన్వయమె. ఘటమునశింపఁగా చెక్కలుముక్కలు కనిపించును. ఆచెక్కలు ముక్కలు నశింపఁగా చూర్ణముకనిపించును. వస్త్రము దగ్ధముకాఁగా బూడిద కనిపించును. కాలినయినుమునందు పడిన నీటిచుక్కనశింపఁగా దానియన్వ యము సముద్రమునందు అనుమానింపదగును. నీటిచుక్కలోను సముద్ర ములోను జలతత్త్వము భేదించుటలేదు. ఆబిందువుకూడపోఁగా దానియన్వ యము సముద్రమునందున్నది." అనిచెప్పఁబడినది.

అట్లునుకార్యముయొక్క యన్వయమునకు యోగ్యమైన దూదిగింజల యవయవములందు లత్తుకరససేచనము ఆయవయవములందు ఫలమగు వటకు అన్వయముపొందు వానియందు రక్తి ఉన్నది. ఇట్లుకాగా ఒకచోట సం స్కారము ఇంకొకచోట తత్ఫలము అని దృష్టాంతములేకపోవుచున్నది. కాన కారణాత్మయందుకర్మ కార్యాత్మయందు తత్ఫలభోగము అన్న (బౌద్ధుల) అభి మతము సిద్ధింపదు. పూలమాలలోపువ్వులకంటె వేఱుగాదారమున్నట్లు ప్రవాహ రూపముగానున్న యాత్మలకంటె వేఱుగా ఇంకొక ప్రవాహమున్నచో ఒకే ప్రవాహము కర్మకర్తగానుఫలభోక్తగాను ఉన్నదని చెప్పశక్యమగును. అట్టి ప్రవాహమున్నట్లు ప్రమాణపడవిని పొందుటలేదు. ఇట్లును చెప్పఁబడినది.–

"సజాతీయాః క్రమోత్పన్నాః ప్రత్యాసన్నాః పరస్పరం
వ్యక్తయస్తాసు సంతానః నచైక ఇతిగీయతే"

సజాతీయములో క్రమముగా పుట్టినవి పరస్పరము వ్యవధానములేక దగ్గఱగానున్నవి యగువ్యక్తులందున్న సంతానమొకటే అని గానముచేయఁ బడుచున్నది." అవి

మఱిపైని జెప్పిన కార్యకారణ భావ నియమము అతిప్రసంగమును భగ్నముచేయుటకు తగినదికాదు. ఎట్లనఁగా—అపుడు ఉపాధ్యాయ బుద్ధిచే అనుభవింపఁబడిన దానిని శిష్యుని బుద్ధిస్మరింప వలసియైయుండును లేక ఆ స్మరణచే వృద్ధిపొందినదైన కర్మఫలమునైన అనుభవింపవలసియుండును. అట్లును చేసినదానికి నాశనముచేయనిదానికి లాభముకలుగవలసివచ్చును. ఉపాధ్యాయబుద్ధి సంతానములో క్రమముగా పుట్టిన క్షణికములైనవి అనేకబుద్ధులు. వానిలో శిష్యునికి ఉపదేశించు కాలమందుదలి క్షణికబుద్ధినుండి రెండుబుద్ధులు పుట్టును. ఒకటి యుపాధ్యాయునిదగ్గర రెండవది శిష్యునిదగ్గర. శిష్యబుద్ధి ఉపాధ్యాయబుద్ధులకు కార్యకారణ భావముండుటవల్ల ఉపదేశమునకు ముందు ఉపాధ్యాయుని బుద్ధి అనుభవించిన దానిని తరువాత సంతానములోని యుపాధ్యాయబుద్ధి అనుసంధానించును. దాని తరువాత ఉపదేశము పిదప శిష్యబుద్ధి అనుసంధానించును. అపుడు ఉపాయబుద్ధికర్మకు ఫలము శిష్యబుద్ధికి కలుగవలసియున్నది. అట్లే ఉపాధ్యాయుడు చేసినకర్మకు ఫలములేకుండ శిష్యుడుచేయనికర్మకు ఫలమువచ్చుట అను రెండుదోషములు కలుగుచున్నవి. ఇదియు సిద్ధసేనవాక్యకారుని చెప్పబడినది."

కృతప్రణాశాకృత కర్మభోగభవ ప్రమోక్షస్మృతి భంగదోషాన్
ఉపేక్ష్యసాక్షాత్ క్షణభంగమిచ్ఛన్నహో మహాసాహసికపరోస్ః

(వి. స్తూ. 18)

కృతప్రణాశదోషమును అకృతకర్మభోగదోషమును భవభంగదోషమును ప్రమోక్షభంగదోషమును స్మృతిభంగదోషమును సాక్షత్తుగా అనుభవసిద్ధమైనవీని నుపేక్షించి ఉదయానంతర వినాశరూపమైన క్షణభంగమును కోరుచున్నవాడై పరుడగు బౌద్ధుడు ఎంత మహాసాహసికుఁడుగానున్నాఁడు" అని చేసిన కర్మ ఫలములేకుండ నశించుట కృతప్రణాశము. చేయని కర్మకు ఫలముపొందుట అకృతకర్మభోగము. ఆత్మక్షణికముగాన సంసారభంగము భావభంగము ప్రకర్షగా అపునర్భవముచే కర్మబంధ ముక్తికిభంగము ప్రమోక్షభంగము అనుభవించినది స్మరింపకుండనె వెంటనె నశించుట స్మృతిభంగము.

మఱియు క్షణికత్వపక్షమందు జ్ఞానముయొక్క కాలమందు జ్ఞేయము లేకపోవుటచేతను జ్ఞేయముయొక్క కాలమందు జ్ఞానము లేకపోవుటచేతను, గ్రాహ్యగ్రాహకభావము ఉపపన్నముకానపుడు లోకయాత్రయంతయు అస్తమించిపోవలసివచ్చును. కుడియెడమ కొమ్ములకువలె ఏదిదేనికికారణమగును అను కార్యకారణ భావము సంభవమగుటచేత అగ్రాహ్యమునకు ఆలంబన ప్రత్యయము అనుపన్నమగుటవలన జ్ఞానజ్ఞేయములు ఒకేసమయమునయుండునని శంకింపరాదు. మఱి యింక భిన్నకాలములందున్నదానికి ఆకారార్పకత్వము ద్వారా గ్రాహ్యత్వము కలుగునన్నచో ఎట్లయున, ఆకారమునర్పించుటలో కాలమందా ఘటములేకున్నను జ్ఞానముచే గ్రాహ్యమని చెప్పఁబడుచున్నది. క్షణికమైన ఘటమును స్వాకార సదృశాకారమును సమర్పించి నశించునని జ్ఞా. క్షణికమైన జ్ఞానము ఆశ్రయమగుచున్నదని చెప్పుట కష్టమగుటచేత సాకారజ్ఞాన వాదము నిషేధింపఁబడుచున్నది. కనుక—అది పేశలముకాదు. యోగ్యతావశమున ప్రతికర్మలో ఇది చక్షుషజ్ఞానరాసన (అసనాగ్రాహ్య) మని స్పార్శన (స్పర్శచే గ్రాహ్య) మని ప్రతినియతమైన విషయవ్యవస్థ ఉన్నదిగదా. ఎట్లన జ్ఞానమనిరాకారమన్నపుడు విషయాకార రహితమైన జ్ఞానమె ఘటాదుల గ్రహించునదై ప్రతి పురుషునికి ముందుముందుగా ప్రత్యక్షముగా అనుభవింపఁబడును. కాని అద్దములో ప్రతిబింబించినట్లు మాత్రము కాదు. జ్ఞానము విషయాకారమును ధరించినదన్నచో జ్ఞానమునకు అర్థమందు పర్వతము దూరమందున్నది దగ్గరగానున్నది ఇది పొడగుది ఇది పొట్టిది ఇత్యాది వ్యవహారమునకు తిలాంజలి యివ్వవలసివచ్చును. ఇది మఱి యిష్టము కాదు. ఏలయన పర్వతము దగ్గరగానున్నది ఇత్యాది వ్యవహారములు నిర్బాధముగా ఉన్నవి. కనుక అద్దము మొదలగువానిలో అట్లు లభింపకపోవుటవలన ఆకారము గలవి దగ్గఱగానున్నట్లు వ్యవహారమగునని చెప్పరాదు. అద్దమునందువలె జ్ఞానముచే గ్రహింపబడిన యాకారము కల్పనీయమగును కనుక ఆకారమందు దూరత్వాద్యనుయానము సంభవింపదు. మఱియును అర్థమువల్లఁ గలుగు జ్ఞానము దానినీలాకారమును అనుకరించినట్లు దా నిజడత్వమును అనుకరించినచో అర్థవంతమైన ఘటాది జ్ఞానము జడము కావలిసి వచ్చును. అటువంటప్పుడు వడ్డీకి బదులు అసలుకూడ నష్టపడవలసివచ్చును. సరే మఱి ఈ దోషము పరిహరించు కోరికలో జ్ఞానము జడత్వమును అనుకరింపదని

యన్నచో భౌర అపుడు దానికిని గ్రహణము కాకపోవును. ఒకదానిని పొంద గోరువారికి ఇంకొకటికూడ పోవును అను న్యాయమగును. ఓయీ జడత్వ గ్రహణము కాకపోవుగాక. దానివల్ల మనకేమి నష్టమువచ్చును. దానిని గ్రహింపక పోయినపుడును నీలాకారమును గ్రహించునపుడు వాని భేదము అనేకాంతమైనను అగును. నీలాకారమును గ్రహించినపుడు గ్రహింపఁబడని జడత్వము ఎట్లు దాని రూపమగును? అట్లుగానిచో గ్రహింప బడకున్నను గ్రహింపఁబడినదానికే స్వరూపము అని యంగీకరించినచో- గ్రహింపఁబడిన స్తంభమునకు గ్రహింపఁబడని త్రైలోక్యముగూడ రూపము కావలసివచ్చును. ఈ విషయమంతయు అర్హత మతానుసారులగు ప్రభాచంద్రుడు మొదలగు వారిచే ప్రమేయకమలమార్తాండాదులందు (ప్ర. క. మా. పుట 27) ప్రబంధ మందు విస్తరింపబడినదని గ్రంథము పెరుగునను భయముచే నిట చెప్పబడ లేదు.

కనుక పురుషార్థమందు అభిలాషగల పురుషులచే బౌద్ధులమార్గము అను సరింపదగినది కాదు. అర్హతులమార్గమే అనుసరింపదగినది. అర్హతుల స్వరూ పమును హేమచంద్ర సూరులచే ఆప్తనిశ్చయాలంకారమందు చెప్పఁబడినది.

"సర్వజ్ఞుఁడును రాగాదిదోషములను జయించినవాఁడును త్రిలోకపూజి తుఁడును యథార్థవాదియు దేవుఁడైన యర్హతుఁడే పరమేశ్వరుఁడు" అని.

సరే ఓయీ! సర్వజ్ఞపదముచేత తెలియదగిన పురుష విశేషుడెవడును ప్రమాణపదవిని పొందుటలేదు. ఏలయన అతని యునికిని గ్రహింపఁజేయు ప్రత్యక్షానుమాన శాబ్దోపమానార్థాపత్తులనెడి యయిదు ప్రమాణములు ఆ సర్వ జ్ఞునియందు ఉపలబ్ధము అగుటలేదు. అట్లును తౌతాతితులచే (బౌద్ధులచే) చెప్పఁబడినది.

"ఇప్పుడు మనబోటివారిచే సర్వజ్ఞుఁడు చూడబడుటలేదు. అతనిని అను మానించునట్టి యేక దేశముగాని లింగముగాని కనిపించుట లేదు. నిత్య సర్వజ్ఞబోధకమైన యాగమ విధి ఏదియును లేదు. అందు అర్థవాదములకు తాత్పర్యమును కల్పింపబడుటలేదు. అన్యార్థప్రధానములైన వానిచేత అతని

అస్తిత్వమును విధింపబడుటలేదు. ఇదివరలో అన్యులచే బోధింపబడినది అను వదించుటకు శక్యము గాదు. అనాదియైన యాగమమునకు ఆదిగల సర్వజ్ఞుఁడు అర్థము కాదు. కృత్రిమమైన సత్యముచేతనైతే అతఁడెట్లు ప్రతిపాదింపబడును. మఱి ఆ వచనముచేతనే సర్వజ్ఞుఁడు అజ్ఞులచేఁ బ్రణీయమానుఁడగుచున్నాడు. అన్యోన్యాశ్రియములైన యీ రెండిటికి ( సర్వజ్ఞత్వమునకు దానిని అనుమానముచే సిద్ధింపఁజేయు సత్యత్వమునకు ) సిది యెట్లు కల్పింపఁబడును. సర్వజ్ఞునిచేత చెప్పఁబడుటచేత వాక్యము సత్యము. ఆ సత్యవాక్యముచే ఆ సర్వజ్ఞుని యునికి తెలియుచున్నది. సిద్ధమైన మూలములేకుండ ఆ రెండు ( వాక్యసత్యత్వము సర్వజ్ఞత్వము ) లెట్లు సిద్ధించును. అసర్వజ్ఞునిచే ప్రణీతమై మూలములేని వాక్యమువల్లనైతే సర్వజ్ఞుని తెలిసికొనువారు స్వవాక్యమువల్ల ఎందుకు తెలిసికొనరు. ఇప్పుడు సర్వజ్ఞునితో సమానమైన యుపమానమును మనము చూచినచో అపుడు ఉపమానముచే సర్వజ్ఞుని దెలిసికొందుమే. బుద్ధునికి సర్వజ్ఞత్వమె లేనిచో ధర్మాధర్మాదిగోచరమైన బుద్ధుని యుపదేశముకూడ ఇతరవిధముగా ఉపపన్నము కాకపోవలసివచ్చును. ఈ విధముగా ఇక్కడ యుక్తముకాదు. ఉపదేశములోని సత్యత్వము గొప్పదనమును (అధ్యక్ష పదవిని) పొందుటలేదు గాన ఇక్కడ అర్థాపత్తి ప్రమాణముగూడ యుక్తముకాదు" ఇత్యాదికము.

ఇక్కడ పై విషయము తిరుగ తోడబడుచున్నది. "ఆతని యునికిని గ్రహింపఁజేయు ప్రమాణపంచకము అక్కడ ఉపలబ్ధము కాకపోవుటవలన అతడు ప్రమాణపదవిని పొందుటలేదు" అని పైని చెప్పిన విషయము అయుక్తము. "అతని యునికిని దెలుపునట్టి యనుమానాదికమున్నది గదా. ఎట్లన, సకల పదార్థములను సాక్షాత్కరింపఁజేయు నొకానొక యాత్మ కలదు. అతని గ్రహించు స్వభావము ఉండగా బాగుగ క్షీణమై ప్రతిబంధ ప్రత్యయము ముండుటవలన, ఏదేది గ్రహించు స్వభావము ఉండగా బాగుగక్షీణించు ప్రతిబంధ ప్రత్యయము కలదో అది యది సాక్షాత్కరింపఁజేయునది ఎట్లన, తిమిరాది ప్రతిబంధముపోయిన లోచన విజ్ఞానము రూపమును సాక్షాత్కరింపఁజేయునది. అతనిని గ్రహించు స్వభావముండఁగా బాగుగా క్షీణించు ప్రతిబంధ ప్రత్యయము కలదియును ఒకానొక యాత్మ. కనుక సకల పదార్థము

లను సాక్షాత్కరింపఁ జేయునది" అని అశేషమైన యర్థములను గ్రహించు స్వభావమైతే ఆత్మకు (= అర్హన్మునికి) అసిద్ధము కాదు. ఎందువల్లననగా నిఖిల జ్ఞానోత్పత్తి చోదనాబలమువల్లనే కాని ఇంకొకవిధముగా ఉపపన్నము కాకపోవుటచేత సర్వము అనేకాత్మకము సత్త్వముగుటవల్ల అని వ్యాప్తిజ్ఞానము పుట్టుటవల్లను గూడ. చోదన (వేద విధివాక్యము) అయితే భూతభవిష్యద్వర్తమాన్మ కాలిక స్వర్గ విషయములను సూక్ష్మవ్యవహిత దూరమందున్న జన్మాంతర దేశాంతర విషయములను తెలియఁబర్చును అని చెప్పుచు, విధి నిషేధ విచారణా నిబంధనమైన సకలార్థ విషయజ్ఞానమును గ్రహించు యజ్ఞమీమాంసా గురువులచే ఆత్మ సకలార్థగ్రహణ స్వభావము కలదని యంగీకరించఁబడినది. అఖిలార్థములకు ప్రతిబంధకమైన యావరణమును నశింపఁజేయుటలో అనుపపత్తి లేదు. అర్హన్మునికి అఖిలార్థ విషయక జ్ఞానములు ఎక్కడను ఏదియు ప్రతిబంధకము గాదన్నమాట. ఆవరణములను నశింపఁజేయుటకు హేతువైన సామగ్రీ విశేషమయిన సమ్యగ్దర్శన సమ్యక్జ్ఞాన సమ్యక్చారిత్ర రూపరత్నత్రయము అర్హన్మునికి ప్రతీతమగుటవలన ఉన్నది కనుక ఈ విధముగాగూడ క్షుద్రమైన యుపద్రవములను పోగొట్టవలయును.

ఓయి, ఆవరణముబాగుగా క్షీణించుటవల్ల అశేషవిషయములుగల విశదమైన విజ్ఞానము ముఖ్యముగా ప్రత్యక్షమగునని చెప్పబడినది యుక్తము కాదు. ఏలనన, సర్వజ్ఞుఁడు అనాదిగా ముక్తుడగుటచేత వానికి ఆవరణము సంభవించదు కనుక, అన్నచో-అనాదిగా ముక్తుడైనవాడే సిద్ధింపకపోవుట వల్ల అట్లనరాదు. సర్వజ్ఞుఁడు అనాదిగా ముక్తుఁడు. ముక్తుడగుటవల్ల, ఇతరులైన ముక్తులవలె. బద్ధులనుబట్టి వీరు ముక్తులు అని వ్యవహారము కలుగును. బద్ధులని వ్యవహారము లేనప్పుడును ముక్తులు అనివ్యవహారము గూడ ఆకాశమునకువలె లేకపోవలసివచ్చును. అది తెలియని క్షిత్యాదికార్య పరంపరకు కర్త అగుటద్వారా అది సిద్ధించుచున్నదిగాదా. ఎట్లన క్షిత్యాదులు కర్త గలవి కార్యములగుటవల్ల ఘటమువలె. కార్యత్వమె సిద్ధింపక పోవుటవల్ల అదికూడ సరియైనదికాదు. సావయవమగుట ద్వారా కార్యత్వసాధనమని చెప్పఁదగదు. దేనివల్ల ఏకార్యమువల్ల వికల్పజాలము అవతరించుచున్నదో. సావయవత్వమనఁగా అవయవసంయోగిత్వమా? అవయవసమవాయిత్వమా?

అవయవజన్యత్వమా సమవేతద్రవ్యత్వమా? లేక సావయవ బుద్ధివిషయత్వమా? ఆకాశాదులందు వ్యభిచరించుటవల్ల మొదటిదికాదు. ఆకాశమందేయవయవము భాగములు లున్నవో వానితో సంయోగము ఆకాశమునందున్నది కాన అవయవ సంయోగిత్వ రూపసావయవత్వము కార్యత్వమునకు సాధనమై ఆకాశమందున్నది. కాని నైయాయికులు ఆకాశమును కార్యము అని యనలేదు కాన సాధ్యాభావ వద్వృత్తిరూప వ్యభిచారగ్రస్తమైనది సావయవత్వహేతువు. ఆకాశమునకు భాగములె లేవని భ్రమింపరాదు. భాగములె లేకపోయినచో అది వ్యాపకమెట్లగును. ఇంక సామాన్యాదులలో వ్యభిచరించుటవలన రెండవదియు సరికాదు. ద్రవ్యత్వాది సామాన్యము ఎట్లు ఘటమందు సమవాయిమో అట్లు ఘటావయవములందును. ఘటావయవములు అద్రవ్యములని చెప్పుటకు శక్యముకాదు. ఘటత్వము ఘటమందు వ్యాప్యవృత్తిగా ఉండుటచే ఘటావయవ సమవాయము ఘటత్వమందు ఆవశ్యకము కనుక. అవయవములతో సంబంధము లేకుండ ఘటత్వాదిజాతి ఘటము మొదటినుండి చివరవఱకు ఘటమునంతను వ్యాపించును. కనుక ఘటత్వసామాన్యమందు ఘటావయవ సమవాయత్వమున్నది. కాని అక్కడ కార్యత్వమిష్టముకాదు. కనుక వ్యభిచారమని భావము. సాధ్యముతో సమానమగుటవల్ల అవయవజన్యత్వము అను మూడవపక్షమును నరికాదు. ఎట్లు సాధ్యమైన కార్యత్వము సందిగ్ధమగుటవల్ల సాధనీయ మగుచున్నదో అట్లె దానిని సాధించు సావయవత్వముకూడ అవయవజన్యత్వరూపము సందిగ్ధమగుటవలన సాధనీయమగుచున్నది. సంఘముగానైన తంతువులే పటము కనుక ఇట్లు పటాదులైన కార్యమందు అవయవజన్యత్వము అప్రామాణికము కనుక. రెండువికల్పార్గల గ్రహములచే గ్రస్తమగుటవల్ల నాల్గవదైన సమవేతద్రవ్యత్వమును సరికాదు. సమవేతద్రవ్యత్వమనఁగా సమవాయసంబంధమాత్రము గల ద్రవ్యత్వమా లేక ఇంకొకచోట సమవేతద్రవ్యత్వమా వివక్షింపఁబడి హేతువుగాఁ జేయఁబడుచున్నది. తనకంటె ఇంకొకచోట సమవాయసంబంధములో ఉండుఁగా ద్రవ్యత్వమని అర్థము. ఎట్లన, పటముతనకంటె ఇతరతంతువులందు సమవాయ సంబంధములో నున్నదై ద్రవ్యముకూడ నగుచున్నది. సమవాయసంబంధ మాత్రముగ ద్రవ్యత్వమగుచున్నచో దానికిఁగూడ ఆకాశాదినిష్ఠ శబ్దాదిగుణములు ఆకాశమందు సమ్బవాయముగా ఉండుటవల్లను, ద్రవ్యత్వాది జాతులున్న

సమవాయసంబంధములో నుండుటవల్లను, గగనాదులందు వ్యభిచారము కలుగును. ఇంక ఇంకొకచోట సమవేతద్రవ్యత్వమను రెండవపక్షమందు సాధ్యసమానత్వమున్నది. ఘటముకంటె అన్యశబ్దార్థములును సమవాయకారణములును నైన తంతురూపావయవములందు సమవాయము సాధించదగినది కాన. కాని ఆతంతువులు పటముకంటె వేఱైనవగుట అప్రామాణికమగుటచేత ఇంకొకచోట సమవేతద్రవ్యత్వరూప సావయవత్వము సాధ్యకార్యత్వమువలె సాధింపదగినది అగునని భావము. ఇదిఏదోలాగు సమవాయము ఉన్నదని అంగీకరించి చెప్పఁబడెను. అసలు నిజమునకు వేదాంతులుకాని జైనులును సమవాయమును అంగీకరింపక పోవుటవల్ల సమవాయమె సంభవింపదు. ఇందులో ప్రమాణములేదు కనుక. ఇంక మఱి సావయబుద్ధి విషయత్వరూప సావయవత్వములను అయిదవ పక్షమును సరికాదు. ఆత్మాదులలో అనేకాంత్యమగుటవల్ల సావయవములగు శరీరాదులలోఁగూడ ఆత్మకు సంబంధముచేత లాక్షణికమైన సావయవత్వబుద్ధియె ఆత్మయందు కలుగుచున్నది. కాని తాత్త్వికబుద్ధికాదు. కనక ఆత్మయందు వ్యభిచారములేదు. అదిసావయవబుద్ధివిషయమైనను దానికి కార్యత్వములేదుకనుక. పంచమపక్షముసరికాదు. సాధ్యకార్యత్వా భావముగల యాత్మయందు సావయవత్వబుద్ధి విషయత్వరూప హేతువు వాస్తవముగా లేదుకనుక. నిరవయవమైనను దీనికి జ్ఞానము సావయసార్థశరీరసంబంధము చేసావయవబుద్ధి విషయత్వము ఔపచారికమని యిష్టపడదగినదికాదు. ఏలయన నిరవయవమైన ఒకపరమాణువునందువలె వ్యాపిత్వము ఉండుట విరోధముకాన. మఱియును ఏమి ఒకడె కర్తసాధింపఁబడుచున్నాడా అనేకులు సాధింపఁబడుచున్నారా? ఒకడె కర్త అన్నచో ప్రాసాదులలో వ్యభిచారముకలుగును. శిల్పి మొదలగుచాలమంది పురుషులుఅందు కర్తలుగానుండుటవలన అనేకులన్నచో అనేకులు విశ్వనిర్మాతలు ఉన్నపుడు వారిలో పరస్పరము బుద్ధిభేదము సంభవించుట తప్పనిసరి యగుటవలన ఒక్కొక్కవస్తువు వేఱువేఱు రూపముగా నిర్మించుటలో సర్వము అసమంజసములుకావలసివచ్చును. అందరిలో సామర్థ్యము సమానముగా నుండుటచే ఒకడే సకలజగత్తును సృజించుట సిద్ధించుచున్నపుడు ఇతరులు ఉండుట వ్యర్థముకాదా, అది వీతరాగస్తుతిలో చెప్పఁబడినది.

"జగత్తునకు కర్తయొకడుగలడు, వాడునుఒకడె.
అతడుసర్వగుడు, అతడు తనవశమందున్నాడు. వాడునిత్యుడు.
ఇవన్నియు కుత్సితమైన యాగ్రహముగల విడంబనలు
ఇవివానిని శాసింపలేవు.

కర్తాశ్చికస్తి జ్జగతః సచైకః, సర్వగః సస్వవశః సనిత్యః
ఇమాఃకుహేవాకవిడంబనాస్యుః, స్తేషాంనయేషామనుశాసకస్త్వం. (వీస్తు-కి)

ఇంకొకచోటంగూడ—

కర్తానతావదిహ కోపియధేచ్ఛయావా
దృష్టోఽన్యథా కటకృతావపి తత్ప్రసంగః
కార్యం కిమత్రభవతాపిచ తక్షకాద్యైః
ఆహత్య చత్రిభువనం పురుషఃకరోతి.

ఇక్కడస్వేచ్ఛచే జగత్తును సృజించినవాడులేడు. అట్లుగానిచో చాప మొదలగునవిచేసినవారివల్లనిక పనేమున్నది. అతఃశ్వరుడే పూర్తిగాప్రభువై అన్నియు చేయుచున్నాడుగదా" అని.

కనుక పూర్వముచెప్పినట్లు సమ్యక్దర్శన, సమ్యక్జ్ఞాన సమ్యక్చారిత్రరూప కారణత్రితయ బలమువలన ఆవరణము నశింపఁగా సర్వజ్ఞత్వమున్నదనుట యుక్తము. ఇతనికి ఇంకొకయుపదేశకుడు లేకపోవుటవలన సమ్యక్దర్శనాదులు కలుగుననుట యనుపపన్నమని చెప్పరాదు. పూర్వులైన సర్వవిదులు వ్రాసిన యాగమమువలని అశేషమైన యర్థజ్ఞానము కలుగుచున్నది గదా. సర్వవిదులవలన సమ్యక్దర్శనాదులు, సమ్యగ్దర్శనాదులవలన సర్వవేతృత్వము కలుగుననుటలో అన్యోన్యాశ్రయమున్నదిగదా అనిఅన్నచో అది బీజాంకురన్యాయమువలె (గింజవలె మొక్కవల్ల గింజవలె) ఆగమములచే సర్వవేతృత్వము సర్వవేతృత్వముచే పరంపర అని యనాదిగా నంగీకరించుటవలనదోషములేదు.

రత్నత్రయమున ప్రసిద్ధమైన సమ్యక్దర్శనాదిత్రితయము అర్హత్ప్రవచన సంగ్రహపరమైన పరమాగమసారమందు "సమ్యక్దర్శక సజ్ఞాన చారిత్ర

ములు మోక్షమార్గ"మని బాగుగానిరూపింపఁబడినది. యోగదేవునిచేతవివరింపఁ బడినదికూడ. ఏవిధముగా జీవాద్యర్థము నియమింపఁబడినదో ఆవిధముగానే అర్హతునిచే ప్రతిపాదింపఁబడిన తత్త్వార్థమందు విపరీతాభినివేశము లేక పోవుట మొదలగునవి యనెడి శ్రద్ధయె సమ్యక్‌దర్శనము. తత్త్వార్థశ్రద్ధానం సమ్యక్‌దర్శనం "తత్త్వముకొఱకైన శ్రద్ధయె సమ్యక్‌దర్శనము" అని తత్త్వార్థసూత్రము.

మఱియును —

రుచిర్జినోక్త తత్త్వేషు సమ్యక్ శ్రద్ధానముచ్యతే
జాయతే తన్నిసర్గేణగురోరధిగమేనచ"

జినులుచెప్పిన తత్త్వములందు రుచియె సమ్యక్‌శ్రద్ధ. అది స్వభావముగాఁ గాని గురూపదేశమువల్లగాని కలుగును. పరోపదేశాపేక్షలేని ఆత్మస్వరూపము నిసర్గము. వ్యాఖ్యానాది పరోపదేశమువల్లఁ గలిగిన జ్ఞానము అధిగమము.

ఏ స్వభావముచేత జీవాదిపదార్థములు నియమింపఁబడియున్నవో ఆ స్వభావముచేత మోహము సంశయములేకుండ తెలిసికొనుట సమ్యక్‌జ్ఞానము అట్లు చెప్పఁబడినది.

యథావస్థితతత్త్వానాం సంక్షేపాద్విస్తరేణవా
యోవబోధస్తమత్రాహుః సమ్యక్‌జ్ఞానం మనీషిణః.

సరిగానున్న తత్త్వములు సంక్షేపముగా గాని విస్తరముగా గాని తెలిసికొనుట సమ్యక్‌జ్ఞానమని మనీషులందురు.

ఆ జ్ఞానము మతి శ్రుతము అవధి మనఃపర్యాయము కేవలము అని యైదువిధములు. అదియు చెప్పఁబడినది. "మతిశ్రుతావధిమనః కేవలాని విజ్ఞానం" అని జ్ఞానావరణమనశించినప్పుడుగాని శాంతించినపుడుగాని ఇంద్రియము మనస్సులను పురస్కరించుకొని వ్యాపారము కల్గుచున్నదై యథా

ర్థమును తలచునది మతిజ్ఞానావరణము నశించినపుడుగాని శాంతించినపుడుగాని మతిలోపుట్టిన స్పష్టమైన జ్ఞానము శ్రుతము. సమ్యక్దర్శనాది గుణములవల్ల ఆవరణనాంశము శాంతముకలుగగా ఎడతెగని విషయము జ్ఞానము అవధి. ఈర్ష్య అంతరాయముల జ్ఞానముచే అవరణమునశింపఁగా శాంతింపగా మిక్కిలి మనోగతమైన యర్థమును స్ఫుటముగా పరిచ్ఛేదముచేయు జ్ఞానము మనః పర్యాయము తపస్వులు తపస్సును క్రియావిశేషములనుఎందుకై సేవింతురో ఆ జ్ఞానము ఇతరజ్ఞాన మిశ్రముకానిదై కేవలమనబడును. వీనిలో మొదటిది పరోక్షము మిగిలినది ప్రత్యక్షము. అదియు నిట్లు చెప్పబడినది.

"విజ్ఞానం స్వపరాభాసి ప్రమాణం బాధవర్జితం
ప్రత్యక్షం చ పరోక్షం చ ద్విధా మేయవినిశ్చయాత్"

దీపమువలె తన్ను ఇతరులను ప్రకాశింపఁజేయు విజ్ఞానము బాధలేనిదై ప్రమాణమగును. జ్ఞేయమును నిశ్చయించుటవల్ల అది ప్రత్యక్షమని పరోక్షమని రెండు విధములు. 116

--- అవాంతర భేదము సవిస్తరముగా అందే తెలియదగినది.

సంసార కర్మనాశము నిమిత్తమై ప్రయత్నించు శ్రద్ధగల జ్ఞానవంతునికి పాపము గలుగుటకు కారణమైన క్రియలనుండి మరలుటయె సమ్యక్చారితము. ఇది సవిస్తరముగా అర్హంతునిచేఁ జెప్పఁబడినది.

తెన్నివిధముల సావద్యయుక్తములైన యోగములను త్యజించుటె చారిత్రమనఁబడును. అది అహింసాది వ్రతభేదములచే అయిదు విధములు. అవి అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము అనునవి. ప్రమాదముచేతనైనను చరాచరములౌ జీవులన్ను తొలగింపకుండుట అహింస. ప్రియము పథ్యము సత్యమునైన వాక్కు సూనృతము. అది అప్రియము అపథ్యమునైనచో సత్యమైనను సూనృతము కాదు. ఇవ్వబడనిదానిని తీసికొనకపోవుట అస్తేయము. నరులకు అర్థమె బాహ్యప్రాణములు. దానిని హరించినచో ప్రాణములు హరించినట్లె. దివ్యములు ( ఇతర శరీరముచే

సేవింపదగినవి.) ఔదరికములును (ఈ శరీరముచే సేవింపదగినవి.) అగు కోరికలను కోరుట అనుమోదించుట చేయించుట అను వానిద్వారా మనో వాక్కాయ కర్మలచే త్యజించుట బ్రహ్మచర్యము. అది పదునెనిమిది విధము లగు (2×3×3=18) వాంఛలను త్యజించుట అపరిగ్రహము. వస్తువులు లేకపోయినను మనస్సునందు ఇచ్ఛచే విప్లవము కలుగును. పంచభావనల చేత అయిదు విధములుగా భావింపఁబడిన మహావ్రతములు అవ్యయ పద మును సాధించును అని భావనాపంచకముకూడ బాగుగా నిరూపింపఁబడినది. 1 వాగ్గుప్తి 2 మనోగుప్తి 3 ఈర్ష్యా సమితి 4 ఆదాన సమితి 5 ఆలోకితపాన భోజనము అని అవి అయిదు. ఇవి అహింసా వ్రతములోనివి. ఇవి ముందు వివరింపఁబడును. 1 శూన్యాగారములందు గిరి గుహాదులుండుట 2 ఇతరుల వద్దగించకుండుట 3 ఆచారశాస్త్రమున భైక్షశుద్ధి 4 ఇది నీది ఇది నాది అని వాదింపకుండుట 5 ఇవి అస్తేయవ్రతములోని భావనలు. 1 స్త్రీరాగ కథా శ్రవణ త్యాగము 2 రమ్యాంగదర్శన త్యాగము 3 పూర్వసుఖస్మరణ త్యాగము 4 శక్తివర్ధక రసత్యాగము 5 స్వశరీర సంస్కారత్యాగము అను నివి బ్రహ చర్య వ్రతములోని భావనలు.

హాస్యలోభ భయక్రోధ ప్రత్యాఖ్యానై ర్నిరంతరం
ఆలోచ్య భాషణేనాపి భావయేత్సూనృతంవ్రతం

హాస్యలోభ భయక్రోధములను జయించుటచే నిరంతరము ఆలోచించి భాష ణముచేత భావింపవలెను అది సూనృతవ్రతము. ఈ మొదలగుగా గలవి నిరూ పింపఁబడును.

ఈ సమ్యక్ దర్శన, జ్ఞానచారిత్రములు కలిపి మోక్ష కారణములగును విడిగా మాత్రము కాదు. రసాయనము వలె జ్ఞానము శ్రద్ధ ఆచరణములు కలి సియె గాని ప్రత్యేకముగా ఫలమును సాధింపవు.

ఇందు సంగ్రహముగా జీవము అజీవము అని తత్త్వములు రెండు. బాధాత్మకమైనది జీవము బాధలేనిది అజీవము. అది పద్మనందిచే నిట్లు చెప్పఁబడెను.

సేవింపదగినవి.) ఔదరికములును (ఈ శరీరముచే సేవింపదగినవి.) అగు కోరికలను కోరుట అనుమోదించుట చేయించుట అను వానిద్వారా మనో వాక్కాయ కర్మలచే త్యజించుట బ్రహ్మచర్యము. అది పదునెనిమిది విధము లగు (2×3×3=18) వాంఛలను త్యజించుట అపరిగ్రహము. వస్తువులు లేకపోయినను మనస్సునందు ఇచ్ఛచే విప్లవము కలుగును. పంచభావనల చేత అయిదు విధములుగా భావింపఁబడిన మహావ్రతములు అవ్యయ పద మును సాధించును అని భావనాపంచకముకూడ బాగుగా నిరూపింపఁబడినది. 1 వాగ్గుప్తి 2 మనోగుప్తి 3 ఈర్ష్యా సమితి 4 ఆదాన సమితి 5 ఆలోకితపాన భోజనము అని అవి అయిదు. ఇవి అహింసా వ్రతములోనివి. ఇవి ముందు వివరింపఁబడును. 1 శూన్యాగారములందు గిరి గుహాదులుండుట 2 ఇతరుల వద్దగించకుండుట 3 ఆచారశాస్త్రమున భైక్షశుద్ధి 4 ఇది నీది ఇది నాది అని వాదింపకుండుట 5 ఇవి అస్తేయవ్రతములోని భావనలు. 1 స్త్రీరాగ కథా శ్రవణ త్యాగము 2 రమ్యాంగదర్శన త్యాగము 3 పూర్వసుఖస్మరణ త్యాగము 4 శక్తివర్ధక రసత్యాగము 5 స్వశరీర సంస్కారత్యాగము అను నివి బ్రహ్మ చర్య వ్రతములోని భావనలు.

> హాస్యలోభ భయక్రోధ ప్రత్యాఖ్యానై ర్నిరంతరం
> ఆలోచ్య భాషణేనాపి భావయేత్సూనృతంవ్రతం

హాస్యలోభ భయక్రోధములను జయించుటచే నిరంతరము ఆలోచించి భాష ణముచేత భావింపవలెను అది సూనృతవ్రతము. ఈ మొదలగుగా గలవి నిరూ పింపఁబడును.

ఈ సమ్యక్ దర్శన, జ్ఞానచారిత్రములు కలిపి మోక్ష కారణములగును విడిగా మాత్రము కాదు. రసాయనమువలె జ్ఞానము శ్రద్ధ ఆచరణములు కలి సియె గాని ప్రత్యేకముగా ఫలమును సాధింపవు.

ఇందు సంగ్రహముగా జీవము అజీవము అని తత్త్వములు రెండు. బాధాత్మకమైనది జీవము బాధలేనిది అజీవము. అది పద్మనందిచే నిట్లు చెప్పఁబడెను.

"చిదచిత్ ద్వే పరే తత్త్వే, వివేకస్తద్వివేచనం
ఉపాదేయముపాదేయం హేయం హేయం చ కుర్వతః"

చిత్తు అచిత్తు అని రెండు పరతత్త్వములు. వాని వివేచనము వివేకము. మోక్షార్థియై స్వీకరించినది ఉపాదేయము. వాఁడు విడుచునది హేయము.

"హేయంచ కర్తృరాగాది తత్కార్య మవివేకితా
ఉపాదేయం పరంజ్యోతి రుపయోగైక లక్షణం"

అని రాగద్వేష మోహాదులు హేయము. వాని కార్యము అవివేకము. ఉపయోగమైనదియె లక్షణముగాఁ గల పరంజ్యోతి ఉపాదేయము అని.

జ్ఞాన దర్శనము సహజచిద్రూప పరిణామమును స్వీకరించుటయె ఉపయోగము. ఆ యుపయోగమును వివక్షితార్థమును పరిచ్ఛేదము (నిర్ణయము) చేయుటయె లక్షణముగాఁ గల యర్థగ్రహణ వ్యాపారమె. ఆ వ్యాపారము జ్ఞానరూపముగను దర్శనరూపముగను ఉండును. అ వ్యాపారము రెండు విధములైనను జీవాత్మ సహజముగా చైతన్య రూపముగా పరిణమించుట మాత్రము రెండిటిలోను సమానమె. అందు సాకారజ్ఞానము ప్రత్యక్షము నిరాకార దర్శనము పరోక్షము. ఆ యుపయోగము జీవావయవములు పరస్పరము జీవకర్మల యవయవములతో కలియుటవల్ల కర్మతో ఏకీభవించిన యాత్మ వేఱుగానున్నట్లు తెలుపుటకు కారణమగును. అనఁగా జీవునియొక్కయు కర్మలయొక్కయు అవయవములు పరస్పరము కలియుటచే జీవుడు కర్మతో పాలు నీళ్ళలోవలె ఏకమైపోవును. అపుడు జీవునికి కర్మకు గల భేదము తెలియదు. కర్మలో అణువులు చైతన్యముగా పరిణమింపవు. కనుక ఈ యుపయోగముచే-వివక్షితార్థమును పరిచ్ఛేదము చేయుటచే - జీవాత్మ తనలో కలిసిపోయిన కర్మ పరమాణువులనుండి విడిగా తెలియుటకు శక్యమగును. సకల జీవులకు సాధారణమైన చైతన్యము – ఉపశమము క్షయము క్షయోపశమముల వశమువల్ల ఏర్పడిన ఔపశమికము క్షయాత్మకము క్షయోపశమికముల భావముచేత కర్మయొక్క ఉదయవశమువలన కలుషముకంటె అన్యమైన యాకారముగా పరిణమించిన జీవపర్యాయముల వివక్షయందు జీవరూపముగా నగును. ఇంగువగంధము బురదను విడిచినట్లు ఆత్మయందు

జీవుఁడు జ్ఞానముకంటె భిన్నుఁడుకాడు అభిన్నుఁడును కాడు. ఏదో విధముగా భిన్నాభిన్నుఁడు. పూర్వము అపరమునైన జ్ఞానము అది ఆత్మ అని చెప్పఁబడినది."

ఓయీ భేదాభేదములు పరస్పరము ఒకదానిని పరిహరించి ఒకటి ఉండుటవల్ల ఏదోయొకటి వాస్తవమగును కాన ఉభయ రూపమైనదనుట అయుక్తము-అన్నచో అది యుక్తము కాదు. బాధలో ప్రమాణము లేదు కనుక భేదాభేదముల యనుపలంభమె గదా ప్రమాణము. అదేమెు లేదు. సమస్త వస్తువులు అనేకాంతాత్మికములగుట స్యాద్వాది మతములో సుప్రసిద్ధము కనుక ఇంతతో చాలింతము.

కొందరైతే జీవాస్తికాయము. ఆకాశాస్తికాయము. ధర్మాస్తికాయము అధర్మాస్తికాయము పుద్గ (స్పర్శాదులుగలవి) లాస్తికాయము అను భేదమును బట్టి జీవాజీవముల ప్రపంచమింకొకటి అని చెప్పుచున్నారు. ఈయయిదు తత్త్వములందు కాలత్రయసంబంధి రూపముగా చైతన్యము ఉన్నది కాన స్థితివ్యవహారము కలుగుచున్నది. అనేకావయవములు గలిగి యుండుటవలన శరీరముగలది కాయమని వ్యవహారము కలుగుచున్నది. అందు జీవములు 1. సంసారులు 2. ముక్తులు అని రెండువిధములు. ఒక జన్మనుండి యింకొక జన్మను పొందునవి సంసారులు. మరల అవి రెండువిధములు. 1. సమనస్కములు 2. అమనస్కములు అని. అందు సంజ్ఞకలవి సమనస్కములు శిక్షణమును క్రియను ఆలాపమును గ్రహించు రూపముగలది సంజ్ఞ. అది లేనివి అమనస్కములు. అవి త్రసములు (త్రస్యంతి=చలంతి చలించునవి= జంగమములు) స్థావరములు అని రెండు విధములు. అందు రెండేసి మూడేసి నాలుగేసి అయిదేసి యింద్రియములు గల త్రసములు నాలుగు విధములు. త్వక్కురసన అను రెండు ఇంద్రియములు గలవి శంఖములు పాషాణములు శుక్తులు కృములు మొదలయినవి. త్వక్కురసన ఘ్రాణము అను మూడు ఇంద్రియములు గలవి పిపీలికయూక మొదలైనవి. త్వక్కురసన ఘ్రాణము చక్షువు అను నాలుగింద్రియములు గలవి దంశమశక భ్రమరాదులు త్వక్కురసన ఘ్రాణము చక్షువు శ్రోత్రము అను నైదింద్రియములు గలవి మనుష్య

జీవుఁడు జ్ఞానముకంటె భిన్నుఁడుకాడు అభిన్నుఁడును కాడు. ఏదో విధముగా భిన్నాభిన్నుఁడు. పూర్వము అపరమునైన జ్ఞానము అది ఆత్మ అని చెప్పఁబడినది."

ఓయీ భేదాభేదములు పరస్పరము ఒకదానిని పరిహరించి ఒకటి ఉండుటవల్ల ఏదోయొకటి వాస్తవమగును కాన ఉభయ రూపమైనదనుట అయుక్తము—అన్నచో అది యుక్తము కాదు. బాధలో ప్రమాణము లేదు కనుక భేదాభేదముల యనుపలంభమె గదా ప్రమాణము. అదేమొ లేదు. సమస్త వస్తువులు అనేకాంతాత్మికములగుట స్యాద్వాది మతములో సుప్రసిద్ధము కనుక ఇంతతో చాలింతము.

కొందరైతే జీవాస్తికాయము. ఆకాశాస్తికాయము. ధర్మాస్తికాయము అధర్మాస్తికాయము పుద్గ (స్పర్శాదులుగలవి) లాస్తికాయము అను భేదమును బట్టి జీవాజీవముల ప్రపంచమింకొకటి అని చెప్పుచున్నారు. ఈయయిదు తత్త్వములందు కాలత్రయసంబంధి రూపముగా చైతన్యము ఉన్నది కాన స్థితివ్యవహారము కలుగుచున్నది. అనేకావయవములు గలిగి యుండుటవలన శరీరముగలది కాయమని వ్యవహారము కలుగుచున్నది. అందు జీవములు 1. సంసారులు 2. ముక్తులు అని రెండువిధములు. ఒక జన్మనుండి యింకొక జన్మను పొందునవి సంసారులు. మరల అవి రెండువిధములు. 1. సమనస్కములు 2. అమనస్కములు అని. అందు సంజ్ఞకలవి సమనస్కములు శిక్షణమును క్రియను ఆలాపమును గ్రహించు రూపముగలది సంజ్ఞ అది లేనివి అమనస్కములు. అవి త్రసములు (త్రస్యంతి=చలంతి చలించునవి=జంగమములు) స్థావరములు అని రెండు విధములు. అందు రెండేసి మూడేసి నాలుగేసి అయిదేసి యింద్రియములు గల త్రసములు నాలుగు విధములు. త్వక్కు రసన అను రెండు ఇంద్రియములు గలవి శంఖములు పాషాణములు శుక్తులు కృములు మొదలయినవి. త్వక్కు రసన ఘ్రాణము అను మూడు ఇంద్రియములు గలవి పిపీలికయూక మొదలైనవి. త్వక్కు రసన ఘ్రాణము చక్షువు అను నాలుగింద్రియములు గలవి దంశమశక భ్రమరాదులు త్వక్కు రసన ఘ్రాణము చక్షువు శ్రోత్రము అను నైదింద్రియములు గలవి మనుష్య

పశుపక్ష్యాదులు. భూమి నీరు తేజస్సు వాయువు వనస్పతులు స్థావరములు. అందు మార్గమందలి ధూళి భూమి, ఇటుకలు మొదలైనవి భూమికాయము. భూమి దేనిచే కాయముగా గ్రహింపఁబడినదో అది పృథివీకాయికము. భూమిని కాయముగా ఏది గ్రహింపఁగలదో అది పృథివీజీవము. ఇట్లు జలాదులందు నాలుగు భేదములు గ్రహింపదగును. అందు భూమ్యాదికాయముగా గ్రహించినవి గ్రహింపఁబోవునవియును స్థావరములు గ్రహింపఁబడుచున్నవి. భూమ్యాది భూమికాయాదులు మాత్రము అవి అజీవులుగాన గ్రహింపఁబడవు. ఆ స్థావరములును త్వక్కు అను ఒకే యింద్రియము కలవి. జన్మాంతరమును పొందనివిముక్తములు. ధర్మాధర్మాకాశాస్తికాయములు ఇవి ఒక్కటే క్రియ లేనివియును ద్రవ్యమును ఇంకొకచోటికి తీసికొనివెళ్ళుటకు హేతువులైనవి. అందు ధర్మాధర్మములు ప్రసిద్ధములె. ప్రకాశము గలిగి లోకాకాశము అని చెప్పఁదగిన యాకాశమందు ఆ ధర్మాధర్మములు అంతట తిలలందు తైలమువలె ఉండును. గతిని స్థితిని ఉపగ్రహించుటయె ధర్మాధర్మములకుపకారము. మత్స్యముల సంచారమునకు జలము సాధారణాశ్రయమైనట్లు జీవులకు గతియందు ధర్మము ఆధారమగును. అశ్వాదులకు స్థితియందు భూమి ఎట్లు సాధారణాశ్రయమైనదో అట్లె జీవులకు స్థితియందు అధర్మము ఆధారము. కనుకనె ధర్మాస్తికాయము గతిరూపప్రవృత్తినిబట్టె అనుమానింపదగును. అధర్మాస్తికాయము స్థితినిబట్టి అనుమానింపదగును. ఒక వస్తు ప్రదేశములో ఇంకొక వస్తువు ప్రవేశించుట అవగాహము. అది ఆకాశకృత్యము. "స్పర్శ రసగంధ వర్ణవంతఃపుద్గలాః" (త. సూ. 5-24) స్పర్శాదులు గలవి పుద్గలములు. అణువులు స్కంధములు అని అవి రెండు విధములు. అణ్యంతే=స్పర్శాద్యవస్థలను ఉత్పన్నము చేయుటద్వారా శబ్దించునవి గాన అణువులు అని వ్యుత్పత్తి. అవి భుజింప శక్యముగానివి. గ్రహణనిక్షేపణాది వ్యాపారమునకు యోగ్యములుగాన స్కంధములు. ద్వ్యణుకాదులు స్కంధములు. ద్వ్యణుకాదులు విడగా అణువులేర్పడును. అణ్వాదుల సంఘాతము నుండి ద్వ్యణువులేర్పడును ద్వ్యణ్వాదుల సంఘాతమునుండి మహాభూతము పుట్టును. క్వచిద్భేద సంఘాతాభ్యాం స్కందోత్పత్తిః (త. సూ. 5-26) భేదము అనఁగా విడుట, ద్వ్యణుకాదులనుండి సంఘాతము కలియుటవల్ల స్కంధములు ఉత్పన్నమగును. కనుక పూరించునవి (పూరయంతి) గళంతి=జాఱు

నవిగాన పుద్గలములని వ్యుత్పత్తి. కాలము అస్తికాయము కాకపోయినను అనేకావయవములు లేకపోవుటచేత దాని లక్షణములుండుటవల్ల ద్రవ్యమగును. దాని లక్షణమిట్లు చెప్పఁబడినది. "గుణపర్యాయ వద్ద్రవ్యం" త. సూ. 5-38) గుణపర్యాయముగలది ద్రవ్యము. ద్రవ్యమునకు కూడ నుండి ద్రవ్యమంతట నుండునది గుణము. క్రమముగానుండి ద్రవ్యమంతటనుండునది పర్యాయము. ద్రవ్యాశ్రయా నిర్గుణా గుణాః (త సూ 5-49) ఎట్లనఁగా జీవునికి జ్ఞానత్వాది ధర్మరూపములు. పుద్గలమునకు రూపత్వాది సామాన్య స్వభావములు. ధర్మాధర్మాకాశ కాలములకు వీలునుబట్టి వరుసగా గతి స్థితి అవగాహ వర్తనత్వాది సామాన్య హేతువులు గుణములు. ఆ ద్రవ్యముపైని చెప్పినట్లు అగుట పర్యాయము. ఉత్పాదము తద్భావము పరిణామము పర్యాయము అన్నవి పర్యాయములు. ఎట్లన, జీవునికి ఘటాదిజ్ఞాన సుఖ క్లేశాదులు. పుద్గలమునకు మృత్పిండ ఘటాదులు ధర్మాదులకు గత్యాది విశేషములు. కనుకనే ద్రవ్యములారు అని ప్రసిద్ధి.

కొందఱు తత్త్వములు ఏడని వర్ణించుచున్నారు. అది సూత్రకారుడిట్లనెను- 'జీవాజీవాస్రవ బంధసంవర నిర్జర మోక్షాస్తత్త్వాని' అని (త. స. 1 4)

1 జీవము 2 అజీవము 3 ఆస్రవము 4 బంధము 5 సంవరము 6 నిర్జరము 7 మోక్షము అని తత్త్వములు. అందు జీవాజీవములు ఇదివఱకె నిరూపింపబడినవి. ఇపుడు ఆస్రవము నిరూపింపఁబడుచున్నది. ఔదరిక (స్థూల)ము వైక్రియకము (కించిత్సూక్ష్మము) ఆహారక సూక్ష్మము) తైజసము (సూక్ష్మతరము) కార్మణ్యము(సూక్ష్మతమము)లైన కాయిక వాచిక మానసిక శరీరములు చలించుటద్వారా ఆత్మచలనమె యోగము. అవె కాయయోగము వాగ్యోగము మనోయోగము ఈ యోగమె ఆస్రవము. ఎట్లన, నిరుస్రవహించు వ్యాసము నీరెట్లు స్రవించుటకు కారణమై ఆస్రవమని పిలువబడుచున్నదో అట్లే ఆత్మ సంచన రూపయోగ ప్రణాలిచే కర్మ స్రవించును అదే యోగము ఆస్రవము తడిసిన బట్ట చుట్టుప్రక్కల అంతట గాలితీసికొనివచ్చిన రేణువులను స్వీకరించునట్లు కషాయములనెడి క్రోధాదులనెడి జలముచే తడిసిన ఆత్మ యోగముచే (ఆత్మ చలనముచే) కర్మను అన్ని దేశములచే గ్రహించును. లేక బాగుగా కాల్చిన

ప్రమాదము. సమితులనుగూర్చి గుప్తులనుగూర్చి ముందుచెప్పఁబడును. క్రోధాదులు కషాయము. మిథ్యాదర్శనము అవిరతి ప్రమాదము కషాయ ఇది స్థిత్యనుభవబంధములకు హేతువులు. ప్రకృతి ప్రదేశబంధములకు హేతువు యోగము అని రెండిటికి భేదము. ప్రకృతిబంధము స్థితిబంధము అనుభవబంధము ప్రదేశబంధము అని బంధము నాలుగురకములని చెప్పబడినది. (త. సూ. 8-3) నిమ్మకాయ బెల్లములవల్ల తిక్తత్వ మధురత్వాది స్వభావములు కలిగినట్లు సూర్యకాంతిచేఁ గప్పఁబడిన మబ్బువలె, దీప కాంతిని కనిపించకుండజేసిన కుంభమువలె ఆవరింపదగినజ్ఞాతృత్వశక్తిని దానికి జ్ఞానధర్మనము ఆవరించును. కత్తియంచు మీది తేనెనునాకుటవలె సదసద్వేదనీయము సుఖదుఃఖములను పుట్టింపఁజేయును. దుర్జనసాంగత్యమువలె దర్శనమందు మోహనీయము మోహమును గలుగజేయును. చారిత్రమందు మోహనీయము తత్త్వార్థమందు అశ్రద్ధను మద్యమదమువలె గలిగించును. ఆయుస్సు అయుస్సు (గోత్రము మొదలగునవి ముందువివరించబడెను.) ఈదుచున్నవారి దేహములను జలముబంధించునట్లు లోకమున సంసారమున దేహబంధమును గలిగించును. కుమ్మరివానివలె గోత్రము క్రిందుమీదులనుగూర్చును. కోశాధికారివలె అంతరాయ స్వభావము దానాదులకు విఘ్నములకు అవకాశమును గూర్చును. ఈప్రకృతిబంధము ద్రవ్యరూపమైన ధర్మాధర్మములను కర్మయొక్క అవాంతరభేదములకు మూలమైనప్రకృతిబంధములందుఁ దెలిసికొనఁదగినదై యుండు. అట్లును ఉమాపతివాచకాచార్యుఁడుచెప్పెను — ఆద్యోజ్ఞాన దర్శనావరణవేదనీయ మోహనీయాయుర్నామ గోత్రంతరాయాః (త. సూ. 8-4) జ్ఞానావరణము దర్శనావరణము వేదనీయము మోహనీయము ఆయువు (దీనిచే నారకాదిభవముపొందునది ఏతీతిఆయువు) నామ (నమయతినానాయోనిషునరకాది పర్యాయైశబ్దయతి ఇతినామ) గోత్రము (గూయతే ఉచ్చైర్నీచైశ్చశబ్ద్యతేతి గోత్రమ ) అంతరాయము అనిఆద్యబంధము ఎనిమిది విధములు "తద్భేదంచ సమగృహ్ణాత్ పంచనవ ద్వ్యష్టావింశతి చతుర్ద్విచత్వారింశద్విపంచ భేదాయథాక్రమం (త సూ. 8-5) జ్ఞానావరణము అయిదు విధములు, దర్శనావరణము తొమ్మిది విధములు. వేదనీయము ఇరవై యెనిమిది విధములు. ఆయువునాలుగు విధములు నామము నలభై రెండువిధములు. గోత్రము రెండువిధములు. అంతరాయము అయిదు

విధములు. వీని వివరములు సర్వార్థసిద్ధి అను దానిలో చూపబడినవి. అందుండియె తెలిసికొనందగును. [illegible] విద్యానందాదులచే వివరింపఁబడినది కాన విస్తరభీతిచే ప్రస్తావింపఁబడుటలేదు. మేక ఆవు గేదె మొదలగువాని పాలు ఇంతకాలమెట్లు వానితీయదనమునుండి జాతిపోవవో అట్లే జ్ఞానావరణము మొదలగు మూలప్రకృతులకు మొదటనుండి జ్ఞానావరణ దర్శనావరణ వేదనీయములు మూడింటికి అంతరాయమునకును ముప్పదిసాగరములలో సమానమై కోటికోటి పర్యంతముపోవవు ఉత్కృష్టస్థితికలుగును. (త స. 8=14) ఇది స్థితిబంధము. అందులో వాని స్వభావము మారదు. ఈ మొదలుగా చెప్పఁబడినది అణచరాని మత్తగజేన [illegible] కొంతకాలము స్వభావమునకు ప్రచ్యుతి కలుగదు. ఎట్లు గోమహిషా [illegible] తీవ్రమందాది భావముచేత తన పనులనుజేయుటలో సామర్థ్యవిశేషము అనుభవములోనున్నదో అట్లు కర్మపుద్గలములు తమపనిచేయుటలో సామర్థ్యవిశేషానుభవము కలుగును. కర్మభావముగా పరణమించిన పుద్గలరూప స్కంధము (ద్వ్యణుకాదులు) అగు అనంతానంతప్రదేశములకు ఆత్మావయవములందు నీరక్షీరన్యాయముగా అను ప్రవేశము కలుగును. అది ప్రదేశబంధము అనబడును.

ఆస్రవచలనము (ఆత్మచలనము) సంవరము దీనిచేత కర్మపుద్గలములకు ఆత్మయందు ప్రవేశము నిషేధింపఁబడునో అది గుప్తిసమితి ఇత్యాది రూపమైన సంవరము. కర్మపుద్గలముల సంచారమునకు కారణమైన యోగమువల్ల ఆత్మకు గోపనము (రక్షణము) గుప్తియనబడును. అది మనోవాక్కాయ నిగ్రహభేదముచే మూడువిధములు. ప్రాణిపీడకు పరిహారము చేయుట ద్వారాబాగుగా వర్తించుట సమితి. అది ఈర్యాభాషాది భేదముచే అయిదువిధములు. అది హేమచంద్రాచార్యులచే విస్తరింపఁబడినది—"జనులు తొక్కి సూర్యకిరణములచే ప్రకాశింపఁజేయఁబడిన మార్గమున ప్రాణరక్షణకై చూచి నడచుట ఈర్యాసమితి. నింద్యముకాక సత్యమై సర్వజనహితమైన మితభాషణము భాషాసమితి. ఇది వాచంయములకిష్టమైనది నలభైరెండు రకముల భిక్షాదోషములచే దూషితముకాని మునులుతీసికొను అన్నము ఏషణాసమితి. ఆసనాదులను అందులో ప్రాణులేమైననున్నవే యోధ్యానముతోచూచి యత్నించియు దాటిగ్రహించి విదవ మరల పంపివేయవలెను. ఇదిఆదా

సమితి. ప్రాణులుచేనిచోట కఫమూత్రమలములను యత్నించి విడువవలెను. అది ఉత్సర్గసమితి. ఈ సమితులు ప్రాణిపీడకలగకుండుటకై చెప్పఁబడినది కనుకనే.

"ఆస్రవము స్రోతస్సుయొక్క ద్వారమును ఆవరించును. కాన సంవరమనిపేరు. అని నిర్వచనముచెప్పిరి.

అనియును అభియుక్తులచే చెప్పఁబడినది.

ఆస్రవము జన్మకు హేతువు సంవరము మోక్షమునకు కారణము. ఇది అర్హతుల సృష్టి. మిగిలినది దీనికి వివరణమె.

పూర్వకర్మను తపోధానజపాదులచే నశింపఁజేయుట నిర్జరము. చిరకాలమునుండి ప్రవర్తిల్లిన కషాయకలాపమును పుణ్యమును సుఖదుఃఖములగు దేహములో జీర్ణముచేయును. అనఁగా నశింపజేయును. వెంట్రుకలను పీకికొనుటకూడ తపమనఁబడును. ఆనిర్జర యథాకాలముఔపక్రమికము అని రెండువిధములు. అందు మొదటిది ఏకామందు ఏకర్మఫలప్రదమగునో ఆకాలమందే ఫలమునిచ్చుటవలన నిర్జరఅనియు కామాదిపాకజ అనియు గానము చేముఁబడుచున్నది. ఏకర్మతపోబలమువల్ల తనకోరికచే ఉదయావస్థను పొందియున్నది. అదిఔపక్రమిక నిర్జర అదియు చెప్పఁబడినది.

"సంసారబీజభూతానాం కర్మణాంజరణాదిహ
నిర్జరాసంమతా ద్వేధా సకామాఽకామనిర్జరా"
స్మృతాసకామాయమినామకామా త్వన్యదేహినాం"

సంసారమునకు బీజములైన కర్మలను జీర్ణింపఁజేయుటవలన దానిని నిర్జరఅందురు. అది సకామ అకామ అని రెండువిధములు. యమవంతులకు సకామ ఇతరులకైతే అకామగను అగును.

బంధహేతువులైన మిథ్యాదర్శనాదులను నిరోధింపఁగా ఇంక క్రొత్త కర్మలు ప్రవేశింపకపోవుటచేతను ఇంక నిర్జరాహేతువుయొక్క సన్నిధానమున ఆర్జింపఁబడిన సంచితము పోవుటవల్ల ఆత్యంతికమైన కర్మమోక్షమె మోక్షము. అది యిట్లు చెప్పబడినది.

"బంధహే త్వభావనిర్జరాభ్యాం కృత్స్నకర్మ
విప్రమోక్షణం మోక్షః (త. సూ. 10-5) అని.

బంధమునకు హేతువులు లేకపోవుటచేతను నిర్జరచేతను సమస్తకర్మల నుండివిడువడుటయె మోక్షము. అని.

తదనంతర మూర్ధ్వంగచ్ఛత్యాలోకాంతాత్ (త. సూ. 19-5)

పిదప ఆలోకాంతమువఱకు పైకిపోవును. మఱి చేయిదండము మొదలగు వానిచే త్రిప్పఁబడిన కుమ్మరిసారె ఆ త్రిప్పుట ఆగినను ఆమొదటఁ ద్రిప్పిన బలముచే దానిసంస్కారము నశించువఱకును తిరుగునట్లు సంసారమందున్న ఆత్మమోక్ష ప్రాప్తికై చాలసార్లు చేసిన ధ్యానముక్తునికి ముక్తావస్థ. అది లేకపోయినను పూర్వసంస్కారమువలన ఆలోకాంతమువఱకు పోవుట ఉపపన్న మగును. మరియును బురదపూసిన ఆనపకాయ ఆబురదయొక్కబరువుచే నీటిలోమునిగి ఆబురదకరిగిపోగా పైకితేలినట్లు పూర్వకర్మలవలన సంసారమున పడియున్న కర్మలుపోయినపిదప కర్మలసంగము లేనందువలన పైకి వచ్చును. బంధచ్ఛేదాదులవల్ల * ఆముదపుగింజవలెను, పైకిపోవు స్వభావము ఉండుటవలన నిప్పుజ్వాలవలెను ఆత్మపైకిపోవును. అన్యోన్యము ద్రవ్యప్రదేశములందు అనుప్రవేశము కలుగఁగా వాటిలో అభిన్నముగా ఉండుట బంధము. పరస్పరము కలిసియుండుట మాత్రము సంగము. అది యును చెప్పఁబడినిది.

"పూర్వప్రయోగా దసంగత్వాద్బంధచ్ఛేదా త్తథాగతి పరిణామాచ్చ (త. సూ 106) పూర్వప్రయోగమువల్ల అంసంగమగుటవల్లను బంధచ్ఛేదమువల్ల అట్లు గతి పరిణామముండుటవలనను.

ఆవిద్ధకులాల చక్రవత్య సంగత లేపాలాబువత్ఏరండ బీజవత్ అగ్నిశిఖా వచ్చ (త. సూ. 107) అని.

---

* బీజకాశబంధచ్ఛేదము వలన ఆముదపుగింజ పైకితేలుట ప్రసిద్ధము,

త్రిప్పఁబడి ఆగిన కుమ్మరిసారెవలె బురదపూతపోయిన అనపకాయవలె. అగ్నిజ్వాలవలెను" అని కనుకనే యిట్లు పఠించుచున్నారు.

గత్వాగత్వానివర్తంతే చంద్రసూర్యాదయోగ్రహాః
అద్యాపిననివర్తంతే త్వలోకాకాశమాగతాః (ప. న.)

చంద్రసూర్యాది గ్రహములు వెళ్ళివెళ్ళి మరలును. అలోకాకాశమును పొంది యిప్పటికిని మరలుట లేదు." అని.

మరికొందరైతే సర్వక్లేశములు వానివాసనలు పోయి అపరజ్ఞానము లేక సుఖమే స్వభావముగాఁగల ఆత్మపై ప్రదేశములో ఉండుటే ముక్తియని నిర్ధరించిరి. ఇట్లుసుఖదుఃఖములకు సాధనములైన పుణ్యపాపములతోఁ గూడినవియు పైనిచెప్పఁబడిన తొమ్మిదిపదార్థములును కొందఱుఅంగీకరించిరి. పుణ్యపాపములలోఁగూడినవి జీవాజీవములు ఆస్రవము సంవరము నిర్జరణము బంధము మోక్షమును అని తత్త్వములు తొమ్మిది. విస్తరవిషయములను సంగ్రహముగాఁ జెప్పఁదలఁచిన మేము విస్తరించిచెప్పక ముగించితిమి.

ఇట అన్నిచోట్ల ఏడువిధములుగల సప్తభంగినయమని పేరుగల న్యాయమును జైనులుఅవతరింపఁజేయుచున్నారు. అస్తిత్వము నాస్తిత్వము (ఉనికిలేకపోవుట) మొదలగునవి ఏడును ఒకేవస్తువునందు పరస్పరము విరోధములేకపోవుట ఒక్కమాటుగా ఒకచోటఁన్నియును గలిగియుండుటయు కలది సప్తభంగి లేక సాంఖ్యాదులయందు చెప్పఁబడిన అస్తిత్వాది సప్తనిర్ణయములకు భంగము * సప్తభంగము అది కలది సప్తభంగి అనియు చెప్పవచ్చును.

---

* జైనులకంటె మిగిలినవారందఱు ఏకాంతవాదులు. వారు ఏడువిధములు అందు "సత్కార్యవాదులు సాంఖ్యులు" పదార్థములకునదా అస్తిత్వమే అని యందురు. 2 శూన్యవాదులైన బౌద్ధవిశేషులు మాధ్యమికులు. పదార్థములకు నాస్తిత్వమునె చెప్పెదురు. 3 అసత్కార్యవాదులు నైయాయికాదులు పదార్థములు పుట్టుకకు పూర్వములేవందురు. పుట్టినతర్వాత ఉన్నవందురు. నశించినపిదప లేవందురు. ఇట్లు సత్త్వాసత్త్వము లంగీకరింతురు. 4 జగత్తు మాయఅను వేదాంతులు అనిర్వాచ్యములు ఉన్నపుడు భ్రాంతిఅనిలేవందురు.

ఇక్కడ

1) స్యాత్అస్తి=ఎట్లో ఒకలాగు ఉండవచ్చును.

2) స్యాత్నాస్తి = ఎట్లుఒకలాగు ఉండకపోవచ్చు.

3) స్యాత్ అస్తిచ నాస్తిచ = ఎట్లో ఒక ఉండవచ్చునుకూడ లేదుకూడ.

4) స్యాత్అవక్తవ్యః = ఎట్లో ఉంటవచ్చును నిర్వచించి చెప్పలేనిదియు

5) స్యాత్నాస్తిచ అవక్తవ్యః = ఎట్లో ఉండకపోవచ్చును అని పర్యాయము

6) స్యాత్నాస్తిచ అవక్తవ్యః = ఎట్లో ఉండకపోవచ్చును అనిర్వాచ్యము.

7) స్యాత్అస్తిచ నాస్తిచ అవక్తవ్యః = ఎట్లో ఉండవచ్చును ఉన్నదికూడ లేదుకూడ అనిర్వాచ్యము అని.

అదిఅంతయు అనంతవీర్యుడు ప్రతిపాందించెను. స్యాత్అను శబ్దము నిపాతము, క్రియా ప్రతిరూపకమైన అనిశ్చ యద్యోతకమైనది.

స్యాత్ అన్నది నిశ్చయద్యోతకమైన శబ్దమే అయినచో స్యాత్అస్తి అను వాక్యములో స్యాత్పదము అనర్థకమగును. అనిశ్చయార్థమును ప్రకాశింపఁ జేసినట్లయితే స్యాత్అస్తి కథంచిత్ అస్తి = ఎట్లో ఉన్నది అనునర్థము లభ్యమగుచున్నది కాన అనర్థకముకాదు.

---

5 కొందఱు మాయావేదాంతులె సాంఖ్యోక్త తత్వము స్వీకరించుచు మాయచే అనిర్వాచ్యమందురు. 6 కొందఱు మాయావాదులు శూన్యవాదిచెప్పిన పదార్థముల నాస్తిత్వము స్వీకరించుచు అనిర్వాచ్యమందురు. 7 కొందఱు మాయావాదులు నైయాయికుల సత్త్వాసత్త్వముల స్వీకరించుచు మాయచే అనిర్వాచ్యమందురు. ఇట్లుసాంఖ్యాదులు ఏడుగురు పదార్థముల ప్రదర్శనకాలమున తమ మతముల ననుసరించి ఘటమున్నది. లేదుఅందురు. జైనులు పై వానిని అంగీకరించి కేవలము స్యాత్అను పదమును ఉపయోగింతురు. సాంఖ్యులు ఘటమున్నదనగా ఉన్నది నిజమేకాని నిశ్చితముకాదు. కనుక స్యాదస్తి అనవలెను" అని జైనులు అందురు.

నిశ్చయముగా వస్తువున్నట్లయితే అన్ని విధముల అన్ని సమయాలలో అన్ని చోట్ల అన్ని రూపములు ఉన్నదని స్వీకరించుట త్యజించుటలచే ఒకచోట ఒకప్పుడు ఏదోవిధముగా ప్రవర్తించునుకూడ నివర్తించునుకూడదు. దొరకని వస్తువు ప్రయత్నముచే దొరికినదగును. కాని యైతే అది ఇదివరలో దొరికినదే అట్లే విడుదగినదానిని విడుచుట సంభవించునుగాని విడువదగనిదానిని విడుచుట యెట్లు. అనిశ్చితపక్షములో ఏదోయొకటి ఏదోయొక సత్యముచేత హానము గాని స్వీకరణగాని మతిమంతులకుతగును. మణివస్తువు స్వభావము సత్త్వమా అసత్త్వమాఅని ప్రశ్నింపవలసి యున్నది. వస్తువునకు అస్తిత్వముస్వభావ మనుటసంభవింపదు. ఘటమున్నది లేదు అనునవి పర్యాయములుగా ఒకేసారి ప్రయోగములేదు. లేదని ప్రయోగవిరోధమున్నదికదా. ఇట్లే యితరమైన చోట్లను తెలియునది. అదియుచెప్పఁబడినది.

ఘటోఽస్తీతి నవక్తవ్యంసన్నేవ హియతోఘటః
నాస్తీత్యపి నవ్యక్తవ్యం విరోధాత్యద సత్త్వయోః.

ఘటమున్నదని అనరాదు. ఏలయనగా ఘటము సత్స్వరూపముగానున్నది గనుక. లేదనికూడ అనరాదు సత్తు అసత్తు అనునది విరుద్ధమైనవిగనుక. మొదలగునవి.

కనుక నిట్లుచెప్పవలెను. సత్తు అసత్తు సదసత్తులు అర్వచనీయము అను వాదములనుబట్టి ప్రతివాదులు నల్గురు. మఱల అనిర్వచనీయముచే మిశ్రమైన సద సవాదిమతములింకను మూడువిధములైనవి. వానినిగూర్చి ఏమివస్తువున్నదా అని ప్రశ్నింపఁగా ఎట్లుఉన్నదని ఈవిధముగా జవాబుసం భవించుటచే ఆవాదులు అందరు నిర్వేదమొందినవారై ఊరకుండిరని సంపూర్ణార్థము నిశ్చయించు స్యాద్వాదమును అంగీకరించినవానికె అపుడపుడు జయముకలుగుచున్నది. కనుక సర్వము ఉపపన్నమె. దానిసె స్యాద్వాద మంజరియందు ఆచార్యుఁడు చెప్పెను.

అనేకాంతాత్మకం వస్తుగోచరః సర్వసంవిదాం
ఏకదేశవిశిష్టోర్థో నయస్యవిషయోమతః;

ఘటాదిపదార్థము ఉన్నది లేదు అని యిత్యాదికముగా సర్వము తెలిసినవారికి గోచరమగును. మాదివస్తువు అనేకాంతాత్మకమై సిద్ధించును. అనేకాంతాత్మకమైన ఘటాదిపదార్థమునకు సత్స్వరూపమైన యేకదేశము విశేషమైన యర్థము ఘటమున్నది లేదు అమనయమునకు విషయము.

న్యాయానా మేక నిష్ఠానాం ప్రవృత్తౌ శ్రుతవర్త్మని
సంపూర్ణార్థ వినిశ్చాయి స్యాద్వస్తు శ్రుతముచ్యతే

ప్రయాణమార్గమందు ప్రమాణప్రతిపన్నార్థములైన యేకదేశపరామర్శస్వరూపమైన యనేకన్యాయములకు ప్రవృత్తికలుగుచుండగా సకలస్వరూప విశిష్టమైన యర్థమును నిశ్చయించు స్యాదస్తి మొదలైన ఘటాదివస్తువులు ప్రమాణ సిద్ధమగునని చెప్పబడుచున్నది. ముత్యములు ఒకదారములో గుచ్చి వానినిఒకహారముగా వ్యవహరించినట్లు అస్తి నాస్తీత్యాద్యనేకన్యాయములు స్యాద్వాదసూత్రములో గుచ్చబడి శ్రుతమను ప్రమాణ వ్యవహారము కలుగునని భావము.

అన్యోన్యపక్ష ప్రతిపక్షభావా ద్యథాపరేమత్సరిణః ప్రవాదాః
నయానశేషా నవిశేషమిచ్ఛన్ నపక్షపాతీసమయస్తథార్హతః
హేమచంద్ర కృతద్వితీయవ్యా తింశి. వస్తుమ్. 30)

పరస్పరముపక్ష ప్రతిపక్షభావములలో నుండుటవలన ఇతర దర్శనములు మాత్సర్యము గలిగియున్నవి. విశేషములేకుండ అన్నినయములకు ఇష్టపడుచున్న ఆర్హతపక్షము పక్షపాతముకలది కాదు. సాంఖ్యులకు సత్కార్యముపక్షము. అది సత్కార్యవాదులైన నైయాయికులకు ప్రతిపక్షము. ఇట్లు ఒకరికి పక్షమైనది ఇంకొకరికి పతిపక్షము. కాని జనులు సత్యాసత్యములను అంగీకరించువారు కనుక వారికి పక్షపాతమన్నది లేదు. వీరు అన్నిటిని అంగీకరింతురు కనుక వీరిక అందరియందు సహృద్భావమేకాని మాత్సర్యమున్నది లేనెలేదని భావము.

జైనమతమును జినదత్తసూరి ఈవిధముగా వివరించెను.

బలభోగోపభోగానాముభయోర్దానలాభయోః
అంతరాయాస్తథానిద్రా భీరజ్ఞానంజుగుప్సితం
హింసారత్యరతీ రాగద్వేషావవిరతిఃస్మరః
శోకోమిథ్యాత్వమేతేఽష్టా దశదోషానయస్యసః
జినోదేవోగురుః సమ్యక్ తత్త్వజ్ఞానోపదేశకః

1 బల 2 భోగము 3 ఉపభోగముల యంతరాయములు 4 దాన 5 లాభాంతరాయములు 6 నిద్ర 7 భయము 8 అజ్ఞానము 9 ఏవగింపు 10 హింస 11 రతి 12 అరతి 13 రాగము 14 ద్వేషము 15 అవిరతి 16 స్మరుఁడు 17 శోకము 18 మిథ్యాత్వము. అను నవిఈ పద్దెనిమిది. ఇవి దోషములు. ఇవియెవనికిలేవో అటువంటి తత్త్వజ్ఞానోపదేశకుడైన జినదేవుఁడు గురువు.

జ్ఞానదర్శన చారిత్ర్యాణ్యపవర్గస్యవర్త్మనీ
స్యాద్వాదస్య ప్రమాణేద్వే ప్రత్యక్షమనుమాపిచ

సమ్యగ్జ్ఞానము సమ్యగ్దర్శనము సమ్యక్ చారిత్ర్యము మోక్షమునకు మార్గములు. ప్రత్యక్షము అనుమానము స్యాద్వాదమునకు ప్రమాణములు.

నిత్యానిత్యాత్మకం సర్వం నవతత్త్వానిసప్తవా.

నిత్యానిత్యాత్మకమైనది అంతయు. తత్త్వములు తొమ్మిదిగాని ఏడుగాని జీవాదులైన యర్థములు 1 స్యాన్నిత్యములు 2 స్యాదనిత్యములు 3 స్యానిత్యానిత్యములు 4 స్యాదవాచ్యములు 5 స్యాన్నిత్యము అవాచ్యము 6 స్యాదనిత్యము అవాచ్యములు 7 స్యాన్నిత్యానిత్యములు అవాచ్యములు జీవములు అజీవములు పుణ్యము పాపము ఆస్రవము సంవరము బంధము నిర్జరము ముక్తి అనితొమ్మిది తత్త్వములు. పుణ్యము సంవరమందు పాపము ఆస్రవమందు అంతర్భవింపఁజేసినపుడు తత్త్వములు ఏడు.

జీనాజీవౌ పుణ్యపాపేచాౖస్రవః సంవరోపిచ
బంధోనిర్జరణం ముక్తిరేషాం వాఖ్యాఽధునోచ్యతే

జీవాదుల లక్షణమిప్పుడు చెప్పఁబడుచున్నది.

చేతనాలక్షణోజీవః స్యాదజీవస్తదన్యకః
సత్కర్మపుద్గలాఃపుణ్యం పాపంతస్య విపర్యయః

చేతనజీవము. అచేతన అజీవము. సత్కర్మాణువులు పుణ్యము. వానికి భిన్నము పాపము.

ఆౖస్రవోస్రోతసో ద్వారం సంవృణోతీతిసంవరః
ౖప్రవేశం కర్మణాంబంధో నిర్జర స్తద్వియోజనం.

ౖస్రోతస్సుకు ఆౖస్రవముద్వారము ఆవరించునది సంవరము. కర్మల ౖప్రవేశము బంధము. ఆబంధమునుండి విడుట నిర్జరము.

అష్టకర్మక్షయాన్మోక్షోఽథాంతర్భావశ్చకైశ్చన
పుణ్యస్య సంవరే పాప స్యాౖస్రవేౖకియతేపునః

కర్మలెనిమిది క్షయించుట మోక్షము. ఇవి కొన్నింటిలో అంతర్భవించును. సంవరమందు పుణ్యము పాపము ఆౖస్రవమునందు అంతర్భవించును.

లబ్ధానంతచతుష్కస్య లోకేగూఢస్య చాత్మనః
క్షీణాష్టకర్మణోముక్తిః నిర్వ్యావృత్తిర్జినోదితా.

పొందబడిన అనంతమైన జ్ఞానదర్శన వీర్యసుఖచతుష్కము కలవానికి లోకములందు గూఢముకానివానికి అష్టకర్మలుక్షీణించిన వానికిముక్తి. గమనాగమనవ్యావృత్తి శూన్యత్వమగును. అదేముక్తి.

సరజోహరణాభై క్షభుజోలుంచిత మూర్ధజాః
శ్వేతాంబరాఃక్షమాశీలా నిస్సంగా జైనసాధవః

రజస్సుహరించు పిచ్ఛిక (చీపురుకుంచె) కలవారై భైక్షమును భుజించువారై పీకివేసిన వెంట్రుకలు కలవారై క్షమాశీలురై నిస్సంగులై శ్వేతాంబరులుందురు.

లుంఛితాః పిచ్ఛికాహస్తాః పాణిపాత్రా దిగంబరా
ఊర్ధ్వాశినో గృహేదాతుర్ద్వితీయాః స్యుర్జినర్షయః
భుంక్తే నకేవలం, నస్త్రీమోక్షమేతి దిగంబరః
ప్రాహురేషా మయంభేదో మహాన్శ్వేతాంబరైఃసహ

జుట్టుపీకికొన్నవారై పిచ్ఛిక (కుంచె) ధరించినవారై పాణియె పాత్రగాఁగలిగినవారై తిన్నదాతయింట పైకి తినుచున్నవారై జినసాధువులుందురు. కేవల జ్ఞానముకలవాఁడు భుజింపడు. స్త్రీకిమోక్షములేదు అని దిగంబరులందురు. పురుషులుగాపుట్టిన తర్వాతనె మోక్షము. ఇదిశ్వేతాంబరులకు దిగంబరులకుఁ గలగొప్పభేదము.

తదీయమంత్రఫలదో మోక్షమార్గే వ్యవస్థితః
సత్త్వైర్విశ్వసనీయఃస్యాత్ ససర్వజ్ఞో జగద్గురుః (౪౦)

వారిమంత్రము ఫలించుట అదే మోక్షమార్గమందున్నది అందు జైనమతము నమ్మదగినది ఆజినుడు సర్వజ్ఞుడు జగత్తునకు గురువు.

పెద్దలిట్లందురు

శ్రోతవ్యఃసుగతో ధర్మః కర్తవ్యః పునరార్హతః
వైదికోవ్యవహర్తవ్యోధ్యాతవ్యః పరమః శివః

బౌద్ధధర్మమువినఁదగినదని, జైనధర్మము చేయుదగినదనివైదికధర్మము వ్యవహరింపఁదగినదని పరమశివుడు ధానింపదగినవాడని, పెద్దలందురు.

చర్ల గణపతిశాస్త్రిచే తెనిగింపఁబడిన
సర్వదర్శన సంగ్రహమందు అర్హాతఁ జైనదర్శనము

**సమాధిసిద్ధి కారకములు** - జన్మములు, మూలికలు, మంత్రములు, తపస్సు, సమాధి ఇత్యాదులు.

**సమానవాయువు** - నాభిస్థానమున నున్న వాయువిశేషము.

**సమానాసనము** - ఒక పాదమును తొడయందుంచి వేరొక పాదమును గుహ్యముపై నుంచుట.

**సమావర్తనము** - సాంగోపాంగముగ వేదవిద్యను, ఉత్తమశిక్షను, పదార్థ విజ్ఞానమును, పూర్ణముగఁ బొందినవాఁడై వివాహవిధాన పూర్వకముగ గృహస్థాశ్రమమును స్వీకరించుటకై విద్యాలయమును వదలి యింటివైపునకు వచ్చుట.

**సమిష్టి** - అన్నియు కూడియుండుట.

**సమ్ముఖోన్ముఖ ముద్ర** - చేతివ్రేళ్ళు కలియునట్లు ముడిచి అట్లు రెండు చేతులు ఒకదానికొకటి యెదురుగ నుండునట్లు పట్టెడి గాయత్రిముద్ర.

**సరస్వతి** - విద్యాధిదేవత, వాగ్దేవత, ప్రణవము, సుషుమ్నానాడి, ప్రకృతి. ఒకానొక అంతర్వాహిని యగునది. బ్రహ్మదేవుని భార్య.

**సర్పవిద్య** - అష్టనాగరాజులఁజూడుము.

**సర్వార్థత** - అనేక విషయములయందు పరిణమించు చిత్తధర్మము.

**సర్వాంగాసనము** - శిరమును భూమియందాని అనఁగా రెండుచేతులతో నడుమును పట్టుకొని, భుజములు మొదలు మోచేతులవఱకును గల భుజాస్కందములను, గళమును, శిరముయొక్క వెనుకభాగమును, భూమియందుఁజేర్చి, (భూమియందు శిరముగలిగిన స్థితియందుండి) పాదములను మీఁదుగాఁజాచి యుంచుట. విపరీతకరణి.

**సవికల్ప సమాధి** - జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములను త్రిపుటిగోచరముతో నద్వితీయ పరబ్రహ్మము నందు నంతఃకరణ వృత్తినిఁ దెలిసికొనుట. సబీజసమాధి. సంప్రజ్ఞాత సమాధి.

**సవిచార సమాధి** - పంచతన్మాత్రలు మొదలగు సూక్ష్మవిషయములను గుఱిచేసికొని, యివి యేకాలమందెట్టి స్వరూపముఁ గలిగియుండెనని భావించుట.

**సవితర్క సమాధి** - స్థూలభూతముల లక్ష్యమును గుఱిచేసికొని, వీని శబ్దార్థ జ్ఞానభేదముచే వీనిలో దేనినుండియేది పుట్టినదను కార్యకారణ భావములను విమర్శించునట్టి శబ్దార్థజ్ఞానముల కూటమి.

**సహజ సమాధి** - నిర్వికల్ప సమాధి.

**సహజన్యతాదాత్మ్యము** - తాదాత్మ్య త్రయమును జూడుడు.

**సహజోలి** - వజ్రోలి ముద్రానిమిత్తము స్త్రీ సంభోగమైనపిదప, గోమయముచే సిద్ధపరచఁబడిన బూదిని దంపతులిరువురును లలాటము, నేత్రము, హృదయము, భుజములు, చేతులు మున్నగు సంగములందు బూసికొనుట.